# ప్రజాసాహితి "కరువు" ప్రత్యేక సంచిక, ఆగస్టు 93
# రచయితలకు ఆహ్వానం

రాష్ట్రంలో తాగునీరు లభించక తీవ్ర దుర్భిక్షం, కరువు కాటకాలు పెచ్చరిల్లుతున్నాయి. దీనికి వ్యతిరేకంగా సాగుతున్న ప్రజా ఉద్యమానికి సహాకరించటం మన కర్తవ్యం. అందుకు ప్రేరేపించే వాస్తవిక జీవన సంఘర్షణను ప్రతిబింబించే కథలు, వ్యాసాలు, కవితలు, పాటలు "జన సాహితి" ఆహ్వానిస్తోంది.

దుర్భిక్షానికి పేరు పొందిన రాయలసీమలో ప్రజాస్వామిక భావప్రకటనా స్వేచ్ఛకు కూడా 'కరువు' నెలకొని వుంది. అక్కడి భూస్వామ్య సాయుధ ముఠాల పద ఘట్టనల కింద ప్రజలు అణగారి పోతున్నారు. ఈ దోపిడీ పెత్తందార్ల ఆధిపత్యాన్ని, సాయుధ అణచివేతను ఎదుర్కొనకుండా అక్కడ ఏ ఒక్క సమస్యపై ప్రజా ఉద్యమమైనా నిలదొక్కుకోలేదు. సాగలేదు. కనుక రాయలసీమలో భూస్వామ్య సాయుధ ముఠాల దోపిడీ దౌర్జన్యాలను, వారి అంతః కలహాలనీ, వాటి ఆర్థిక రాజకీయ నేపథ్యాలనూ ఆ ప్రాంతపు సాంస్కృతిక వాతావరణాన్ని చిత్రిస్తూ రచనలు తగినన్ని రావాల్సిన అవసరం వుందని మేము భావిస్తున్నాం. రచయితలూ కళాకారులూ తప్పక స్పందిస్తారని ఆశిస్తున్నాము.

ఆగస్టు 93 "ప్రజాసాహితి"ని 'కరువు' ప్రత్యేక సంచికగా వెలువరించే ప్రయత్నంలో వున్నాము. జులై 15 లోగా రచనలు పంపి సహాకరించ వలసిందిగా రచయితలను కోరుతున్నాము.

— సంపాదకవర్గం

# ప్రజాసాహితి

సాహిత్య సాంస్కృతికోద్యమ మాస పత్రిక

సంపుటి : 16 సంచిక : 12

జూలై 1993


ముఖపత్ర కవిత :

"జను లెల్లరికి నేను జన్మభూమిని రా
భేదించవయ్యో అసమాన భేదముల
అనర్థదమ్మున నేన్నా [illegible]తారు
[illegible] మీరలే మేలు కానుడింక
అనఘోత్తుల క్షాంత అధికార మేల్లా
మోన కృత్యములందు మోహంబు
లేలా
మీ ఇల్లు మీ సుఖము మీ ధనము తోనే
మేది నీ తలమెల్ల మెరయు చుండాలి
కర్షకులు కార్మికులు కలవండి వేగ"

— గరిమెళ్ళ


రచనలు పంపవలసిన చిరునామా

**నిర్మలానంద,**
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావుపేట,
విజయవాడ - 520 002.


**141**

మూడవ కవరు పేజీలో :
సంస్పందన (కవిత)
—శోధన్


ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :
**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.
తెనాలి తాలూకా


నాల్గవ కవరుపేజీలో :
దంచెలోన్ని ఎదిరిద్దాం (పాట)
—మిత్ర





వెల : రూ. 5 సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100
(సం॥లో ప్రచురించిన పుస్తకాలతో)
డి. డి. లు మేనేజర్, ప్రజాసాహితి
విజయవాడ-2 పేరుతో పంపాలి.

## ఈ సంచికలో....


| | | |
|---|---|---|
| ఉద్యమ కవి గరిమెళ్ళ | — (సంపాదకీయం 1) | 3 |
| సత్యాన్ని హత్యచేస్తున్న 'ప్రభుత్వ' బాబా | — (సంపాదకీయం 2) | 5 |
| 'సత్య' శాయిబాబాను హత్యానేరం కింద అరెస్టు చేయాలి | (పత్రికా ప్రకటన) | 8 |
| రాజ్యమేలుదాము రారా! | — (ప్రసంగవ్యాసం) ఛాయరాజ్ | 9 |
| మరణిద్దాం అవసరమైతే (కవిత) | — భైరవి | 15 |
| ఎవరి వేరు ఎక్కడ (కథ) | — స్వామి | 17 |
| ఖావి శత్రువు (కవిత) | — పి. శివి | 29 |
| హెచ్చార్కె కవిత్వం "అబద్దం" (పుస్తక సమీక్ష) | | 30 |
| నెత్తుటి నేల సాక్షిగా (కవిత) | — పి.యస్. రమ | 34 |
| కులమతాలుండాల (వ్యంగ్యం) | — కత్తుల కాంతయ్య | 36 |
| గాజుముక్కలు (కవిత) | — ప్రసేన్ | 40 |
| స్త్రీవాద సాహిత్యం - నడుస్తున్న చర్చ (ప్రసంగవ్యాసం) | — కాత్యాయిని | 41 |
| నటన జీవితం వేరు వేరు కాదు (కవిత) | — చొక్కర తాతారావు | 48 |
| మతోన్మాదాన్ని పదునైన వ్యంగ్యంతో చీల్చి చెండాడిన సాదత్ (సాహిత్య వ్యాసం) | — పరజ | 49 |
| పిల్లల ప్రపంచం | | 53 |
| ఉత్తరాలు | | 57 |
| చైతన్యవాహిని | | 58 |



Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editor : NIRMALANANDA

# ఉపోద్ఘాతం

## ఉద్యమ కవి గరిమెళ్ళ

ఈ 20వ శతాబ్దం విప్లవాల యుగం. కొండ కోనల్నీ, మారుమూల పల్లెల్నీ, విశ్రాంతి నెరుగని నగరాల్నీ ఏకం చేసి సామ్రాజ్యవాద దోపిడీని రూపుమాపే స్వాతంత్ర్యానికై భూస్వామ్య పీడనను అంతం చేసే ప్రజా స్వామ్యానికై సంఘర్షి స్తున్న రోజులివి. అలలు అలలుగా ఎగిసి పడుతున్న ప్రజా ఉద్యమాల తరంగాలు సమసమాజ స్థాపనకై ఉరకలేస్తున్న కాలం మనది-

బ్రిటీషు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం సామాన్య భారతీయుల్ని వీధుల లోనికి తీసుకువచ్చింది. ప్రజా రాజకీయాలను నేర్పింది. జాతీయతను బోధించింది. దేశం కోసం సాటి ప్రజలకోసం త్యాగం చేయాలని ప్రబోధించింది. సమస్త ప్రజానీ కాన్ని ప్రభావితం చేసింది.

ఉద్యమాలు నివురు గప్పిన నిప్పుల్ని రాజుతాయి. మట్టిలో నుండి మాణి క్యాల్ని వెలికి తీస్తాయి. తనను మరొకడుగు ముందుకు వేయించేవారిని సృష్టించు కుంటాయి. తనకవసరమైన సాహిత్య కళారూపాల్ని ఆవిష్కరించుకుంటాయి.

పై లక్షణాలను పుణికి పుచ్చుకున్న స్వాతంత్రోద్యమ తొలి ప్రజాకవి గరిమెళ్ళ సత్యనారాయణగారు. తరువాతి తరాల ఉద్యమ వాగ్గేయకారులు నాజర్, సుబ్బారావు పాణిగ్రాహి, గద్దర్ లకు ఆద్యుడాయన.

తెలుగు వారికున్న అపార జానపద వాఙ్మయాన్ని, వాగ్గేయకారుల వారసత్వ సంపదను ఆవాహన చేసుకొని బ్రిటీషు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఆయన పాటలు కట్టి పాడారు.

"మాకొద్దీ తెల్లదొరతనమూ- దేవ
మాకొద్దీ తెల్లదొరతనమూ
మా ప్రాణాలపై పొంచి
మానాలను హరియించే- మాకొద్దీ"

అంటూ సామ్రాజ్యవాద పాలనలో ప్రజల అగచాట్లనూ, పాలకుల దోపిడీ దౌర్జన్యా లనూ, అణచివేత తీరునీ, విభజించి పాలించే కుట్రలనూ, హిందువుల్లోని కుభేరా లను.... సాధారణ ప్రజానీకానికి అర్థమయే భాషతో, ఉత్తేజపరిచే బాణీతో, 'ఆవేశం' కలిగించే గాత్రంతో శ్రీ గరిమెళ్ళ గానం చేసినందుకు మొత్తం 3½ సం॥లు జైలు శిక్షను అనుభవించాడు. జైలులో ఉండగానే తండ్రీ, తాత మరణించినా ఆయన బ్రిటీషు పాలకులను క్షమాభిక్షను కోరలేదు.

ప్రజాసాహితి

'లౌక్యం' ఎరుగని కారణంగా, స్వతంత్ర ప్రవృత్తి వల్లా జీవితపు చివరి క్షణాల దాకా ఆయన దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించాడు. అయినా తన కలాన్ని వీడకుండా పాటలు, వ్యాసాలు రాస్తూనే వున్నాడు.

స్వాతంత్ర్య పోరాటంలో నిజాయితీగా పాల్గొన్న అనేక మంది లాగానే 'గరిమెళ్ళ' కూడా గాంధీ అహింసా ప్రబోధం ప్రజలకే తప్ప పాలకులకు చేయ లేదన్న సత్యాన్ని గుర్తించలేదు. అలాగే 'రాజ్యం' యొక్క వర్గ స్వభావాన్ని శాస్త్రీయంగా అర్థం చేసుకోలేదు. కనుకనే తెల్లదొరల పాలన పోగానే దేశమంతా స్వర్గం విల్లి విరుస్తుందని ఆశించారు.

తమ కళ్ళ ముందే స్వార్థ రాజకీయ రాబందులు, దోపిడీ దొంగలు ప్రజల్ని పీడిస్తున్నా "మాకొద్దీ నల్ల దొరతనమూ" అని రాయలేకపోయారు. అయినా జీవిత సత్యంగా సాక్షాత్కరించే వర్గ వ్యత్యాసాలు ఆయన గమనించక పోలేదు. అవి రూపుమాసిపోవాలని ఆయన కోరుకున్నాడు.... అందుకే—

"పెద్దలకు లాభాలు బ్యాంకుల్ల నిండా
పేదలకు దుఃఖాలు హృదయాల నిండా"
"నాది నాదనెడి అన్యాయంబువీడు
మనము మనదనెడి సద్గానంబుపాడు"— అన్నాడు.

దోపిడీ పాలకుల దుష్ట రాజకీయాల నుండి నూతన ప్రజాస్వామిక వ్యవస్థకు అవసరమైన 'మంచి' (విప్లవ) రాజకీయాలను వేరుచేసి చూడలేని చాలా మంది కవులు, రచయితలు, మధ్య తరగతి మేధావులు- మొత్తంగా రాజకీయాలనే ద్వేషించి వాటికి దూరంగా ఉండే వైఖరి ఉత్తమోత్తమమైనదిగా ప్రచారం చేస్తూ వుంటారు. నిజానికి కుళ్ళు రాజకీయాలను మంచి రాజకీయాలతో క్షాళన చేయలే తప్ప అసలు రాజకీయాలే వద్దనటం అమలులో వున్న వ్యవస్థను ఇంకా ఇంకా సాగనివ్వటమే అవుతుంది. ప్రజా రచయితలకూ, కవులకూ రాజకీయాలు అంటరానివికావు. పైపైచ్చు జీవితాన్ని మార్చే శక్తి రాజకీయాలకే వుందనే గ్రహింపు వారికి పుష్కలంగా వుంటుంది.

ప్రజా ఉద్యమ కవి కనుక గరిమెళ్ళ వారు "రాజకీయాల నుంచి కవిత్వ విషయాలు ఎంచుకోవాలి కవులు" అని ప్రకటించారు. అంతేకాదు "స్వాతంత్ర వాంఛ అను తేజస్సుతో మిళితములు కాని కవితా సక్తియు- సాహిత్యాభిమానమును కేవల వ్యసనములు. విద్యాభిరుచి యొక విలాస మాత్రము. దైవభక్తి యొక బూట కము" అని స్పష్టం చేశాడాయన.

పేదరికపు నికృష్టపుటంచులు ఆయన చవి చూశాడు కనుకనే-
"భాగ్యవంతుల వైభవములంటె నాకు

బాధించు ప్రణమని బాగా తెలియండి
సైన్యాలు వాళ్ళెపుడు రక్షించవలెనా
కార్మికుల కర్షకుల శక్షించవలెనా"— అని

రాయగలిగాడు.

1947 నాటి స్వాతంత్ర్యాన్ని 'గరిమెళ్ళ' లాంటివారు చాలా మంది బూటక మని గుర్తింపలేక పోయినా— ఈనాటికి పెరిగిపోయిన $2\frac{1}{2}$ లక్షల కోట్ల రూ.ల విదేశీ అప్పు నూతన పారిశ్రామిక విధానం పేరుతో సాగుతున్న ప్రైవేటీకరణ, IMF పేరుతో దేశాన్ని తాకట్టు పెట్టటం, సామ్రాజ్యవాదుల ముందు భారతదేశాన్ని పణంగా పెట్టే డంకెల్ ప్రతిపాదనలు, అందుకు దారితీసిన పరిపాలనా విధానాలను గమనించేవారు మేడిపండు స్వాతంత్ర్యాన్ని అర్థం చేసుకోగలరు. ఇంకా సాధించ వలసిన లక్ష్యంగానే వుండిన స్వాతంత్రం కోసం, సామ్రాజ్యవాద వ్యతిరేక దేశ శక్తులు, గరిమెళ్ళ వారిచ్చిన కళాత్మక ఉత్తేజాన్ని త్యాగ సాంప్రదాయాన్ని స్వంతం చేసుకుని పురోగమిస్తారు. ఆయన శత జయంతి (1993) నాటికి కూడా మారని దోపిడీ పీడనల వ్యవస్థను తుదముట్టించే వరకూ ఆయన అందించిన సాహితీ సాంస్కృతిక వారవడిని స్ఫూర్తిగా స్వీకరిస్తూ యిలా ఉద్యమిస్తారు—

"అన్యాయ కాలంబు దాపురించిందిపుడు
అందరము మేలుకోవాలండి
మాన్యాలు భోగాలు మనుజలందరికబ్బ
మార్గాలు వెతకాలిరండి—"

5-7-93

## సంపాదకీయం : 2

# సత్యాన్ని హత్యచేస్తున్న "ప్రభుత్వ" బాబా

జూన్ 6వ తేదీన పుట్టపర్తిలో జరిగిన సంఘటనలు బాబా మూఢభక్తులకీ, ఆయన ప్రభావాన్ని రాజకీయ స్వార్థానికి వినియోగించుకొంటున్న వారికీ తప్ప ఇతరులకు నమ్మశక్యంగాని విషయంగా వుండదు. ప్రశాంతి నిలయంగా పేరు పొందిన బాబా మందిర ప్రాంగణంలోనేకాదు హృదయాంతరాళాల్లోనే అశాంతినిల యాలున్నాయి. మందుపాతరలున్నాయి. ఈర్ష్యా ద్వేషాగ్నుల కాలనాగులున్నాయి. భక్తులకు నిత్యమూ సత్యాన్నే నూరిపోస్తున్నానని ప్రగల్భాలతో ప్రచారంగావించు కునే బాబాతో సహా శిష్య బృందంలో ఒక్కరు కూడా పోలీస్టేషన్‌కు వెళ్ళి హత్యా సంఘటనను రిపోర్టు రూపంగా యిచ్చిరాలేదు.

ఆచరించటానికి పనికిరాని వెయ్యి నీతి సూత్రాలకన్నా ఒక చిన్న పేడసుద్ద మిన్న.

6-6-93 రాత్రి 'ప్రశాంతి' నిలయంలో ఆరుగురు వ్యక్తులు చనిపోవటం-అందులో నలుగురు పోలీసుల కాల్పులకు బలవటం-కనీసం సాధారణ ప్రజలెవ్వరూ ఎఫ్.ఐ.ఆర్ కూడా ఇవ్వటానికి సిద్ధపడకపోవటం, సర్కిల్ ఇన్స్పెక్టరే అంతా రాసుకోవటం ...ఈ పరిస్థితి ఎవరికైనా అనుమానం కలిగిస్తుంది. సత్యాన్ని హత్యచేస్తున్నారని అనిపిస్తుంది.

పోలీసుకాల్పులలో హతులైనవారు హంతకులేనని అంగీకరించినా వారిని తేలిగ్గా బంధించటానికి ఎంతో అవకాశంవున్నా నలుగురినీ కాల్చి చంపేశారు. రాత్రి ఒకటిన్నరకు తుపాకీ మోతలు వినిపించాయని సాక్షులు చెబుతుండగా గం॥ 11-30 నిమిషాలకే కాల్చేసినట్టు పోలీసులు రికార్డుచేశారు. ఈ మధ్య రెండు గంటల విరామంలో ఏమి జరిగిందో ఊహించుకోవచ్చు. బాబా, ఆయన ట్రస్టు సభ్యులు, పోలీసు ఉన్నతాధికారులు, ప్రభుత్వమూ కుట్రపన్నీ నిజాలను వెలికి రానివ్వకుండా చేయాలని నిర్ణయించుకొని దాన్ని అమలు పరిచారు. పోస్టుమార్టం నివేదిక ప్రకారం అత్యంత సమీపం నుంచి కాల్పులు జరిపినట్టు స్పష్టమవుతోంది. హతుల శరీరానికి కేవలం పోలీసు బుల్లెట్ల గాయాలేకాక పక్కటెముకలు విరిగిపోవటం, వీపుపైభాగం చిట్లిపోయి వుండటం, బాబాశయనమందిరంలో రక్తసిక్తమయిన దుడ్డుకర్ర వుండటం ఇవన్నీ హత్యకు ముందువారిని తీవ్రంగా హింసించారనీ, చివరికి పోలీసుల రివాల్వర్లతో కాల్చి చంపారనీ అర్థమవుతోంది.

1985లో ఒక కెనడాజాతీయుడు "బాబా దేవుడుకాదు దొంగ" అని అరుస్తూ కత్తితో పొడవబోతే అతనిపై హత్యాప్రయత్న నేరం కింద కేసు పెట్టారు. ఆ కేసులో కూడా బాబా భక్తులెవరూ కంటితో చూసిన 'సత్యాన్ని' పోలీసులకు రిపోర్టు రూపంలో ఇవ్వలేదు. ఆనాడు పోలీసులే ఎఫ్.ఐ.ఆర్. రాసుకున్నారు. చివరికి కేసు విచారణ పూర్తి చేయకుండానే ప్రభుత్వ ఖర్చుతో ముద్దాయిని కెనడాదేశానికి బలవంతంగా పంపివేశారు.

ఈసారి కూడా స్థానిక పోలీసు సర్కిల్ ఇనస్పెక్టర్ రాసిన ఎఫ్.ఐ.ఆర్.లో బాబాపై హత్యా ప్రయత్నం జరిగిందనీ, ఆయన పారిపోయి 'డేంజర్ అలారం' మోగించాడనీ వుంటే....పోలీసు ఉన్నతాధికారులూ, హోం మంత్రి బాబాపై హత్యా ప్రయత్నం జరగలేదని ప్రకటనలిచ్చారు. బాబాయొక్క 'భగవచ్ఛక్తి'ని కాపాడటానికి ప్రభుత్వం ఎన్ని పాట్లుపడుతోందీ ?!

రత్నాకర సత్యనారాయణరాజు శాయిబాబాగా రూపు దిద్దుకున్న దగ్గర నుండి వివాదాస్పదమైన వ్యక్తే! ఆయన్ని మోసగాడనీ, దొంగ బాబాఅనీ, గారడీ విద్యలు ప్రదర్శిస్తున్నాడనీ, హోమోసెక్సువల్ అనీ, ప్రశాంత నిలయమే ఒక పెద్ద అంతర్జాతీయ స్మగ్లింగ్ కేంద్రమనీ, 'గొప్పవారి' సుఖభోగాల ఆలయమనీ....ఇలాంటి ఎన్నో ఆరోపణలొచ్చాయి. డాక్టర్ ఎ.టి. కోవూర్, ప్రొఫెసర్ నరసింహయ్య

లాంటి వాళ్ళు బాబా మహిమలు బూటకమంటూ, రుజువుకి నిలబడమని అనేకసార్లు సవాలు చేశారు.

సత్య నిరూపణకు ఆయన ఏనాడూ నిలబడక పోయినా తన పేరుముందు 'సత్య'ను చేర్చుకున్నాడు. తాను స్వయంగా భగవదావతారమని అమాయకభ్రమల చేతా, స్వార్థపర శక్తులచేతా ప్రచారం చేయించుకుని నేటికి అధికార కాంగ్రెసు పాలకుల అత్యావసర దేవుడిగా ఎదిగాడు.

రాష్ట్రపతులు, ప్రధాన మంత్రులు, సుప్రీంకోర్టు న్యాయమూర్తులూ, నిరంకుశాధికారులూ ఆయన ఆశీస్సులకై రాజకీయం జపం చేస్తున్నారు.

బి.జె.పి. వాళ్ళు పుక్కిటిపురాణాల రాతిబొమ్మల దేవుడి పేరుతో అధికార పీఠాలనధిరోహించడానికి లొట్టలు వేసుకుంటూ, ఆగలేక ఆవేశపడుతుంటే, అధికార కాంగ్రెసుపార్టీకి 'బతికున్న దేవుడు' బాబా దిక్కయ్యాడు. అందుకే అటు కేంద్రం నుండి ఇటు రాష్ట్రందాకా ప్రభుత్వాలూ, యంత్రాంగమూ పనిగట్టుకుని వాస్తవాలని కప్పి పుచ్చటానికీ, పక్కదార్లు పట్టించడానికీ ప్రయత్నిస్తున్నాయి. ప్రజలలో వున్న దైవభక్తినీ, విశ్వాసాన్నీ బి.జె.పి.—కాంగ్రెస్ వాళ్ళిద్దరూ 'మౌఢ్యం' స్థాయికి దిగజార్చి తమ అవకాశవాద దోపిడీ రాజకీయాలను ప్రశ్నించనివ్వకుండా చేసుకుంటున్నారు. ఈ రాజకీయ కుట్రను భగ్నం చేయటం ప్రజాస్వామికవాదుల, హేతువాదుల సత్యాన్ని గౌరవించే ప్రతి ఒక్కరి యొక్క కర్తవ్యం.

కొద్ది నెలల క్రితం హైదరాబాదు నగరంలో ఒక కళ్యాణ మండపం ప్రారంభోత్సవ సందర్భంగా, దేశప్రధాని సమక్షంలో, పుట్టపర్తి బాబా బంగారు గొలుసును 'సృష్టించిన' సంఘటనను ఒక వీడియో ఫోటోగ్రాఫర్ కెమేరాలో బంధించాడు. దాన్ని రిలే చేయకుండా దూరదర్శన్ అధికారులు తొక్కిపట్టారు. రాజకీయ వత్తిడి అనే చీకటితో సత్యాన్ని చిదిపివేశారు.

వెలుగు చూడని కారణాలవల్ల అనేకమంది మహిళలూ, పురుషులూ పుట్టపర్తిలో దిక్కులేని చావు చచ్చారని పత్రికల వార్తలు చెబుతున్నాయి.

గత అనేక సం॥లుగా గూడుపుఠానికి, అసత్య జీవనానికీ, అక్రమ ధనార్జనకూ ఆలవాలమైన 'ప్రశాంత' మందిరం కడుపులో దాగిన నిజాలనన్నిటినీ వెలుగులోకి తీసుకురావటం, వాస్తవాలను ప్రజలు తెలుసుకునేట్టు చేయడం అవసరం.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలూ, అధికార యంత్రాంగం బాబా రక్షణకు కంకణం కట్టుకున్నాయి కనుక బాబా భక్తులు కాని సుప్రీంకోర్టు స్థాయి న్యాయమూర్తులచేతా, జర్నలిస్టులూ, మేధావులచేత పౌర ప్రజాస్వామ్య హక్కులసంఘాలు హేతువాదులచేతా వాస్తవ సేకరణ జరిపించటానికి ప్రజాసంఘాలు పూనుకోవాలి. అందుకు 'ప్రజాసాహితి' తనవంతుబాధ్యతను స్వీకరించటానికి సిద్ధంగా వుంది.

**4-7-93**

ప్రజాసాహితి

# 'సత్య' సాయిబాబాను హత్యానేరం కింద అరెస్టు చేయాలి

పుట్టపర్తిలోని ప్రశాంతి నిలయంలో శాంతి కరువై అశాంతి ప్రబలింది. సంఘటనలో ఆరుగురు వ్యక్తులు హతమైతే అనంతరం సత్యాన్ని హత్యచేస్తున్నారు. వందలాది భక్తులు, వేలాది ప్రజలముందు జరిగిన విషయాలను కూడా 'మాయం' చేస్తున్నారు. బాబా నేరాలను కప్పిపుచ్చాలని రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు కుట్రలు చేస్తున్నారు.

పత్రికా విలేఖరులు విచారించి బయట పెట్టిన విషయాల మేరకు కాల్పులు అవసరంలేని చోట మనుషులు చచ్చిపోయే విధంగానే తుపాకులు గురిపెట్టి పేల్చి నలుగురు వ్యక్తులను పోలీసులు హతమార్చారు. దీనికి ముందు పోలీసు అధికారులు 2 గంటలసేపు బాబాతోనూ, ఆయన సన్నిహితులతోనూ చర్చలు జరిపారు. పోలీసులే స్వయంగా తప్పుడు F.I.R.ను సృష్టించారు. బాబా నేరాలను కప్పిపుచ్చాలని ప్రభుత్వమూ, పోలీసులూ, బాబా స్వార్థ భక్తులూ ప్రయత్నిస్తున్నారు.

కనుక ఈ మొత్తం సంఘటనల పూర్వాపరాలపై బాబా భక్తులు కాని నిష్పక్షపాత బృందంతో విచారణ జరిపించాలి. ఆ బృందంలో జస్టిస్ వి.ఆర్. కృష్ణయ్యర్, చిన్నపరెడ్డి, వి.యం. తార్కుండే, నిఖిల్ చక్రవర్తి (సంపాదకుడు) కులదీప్‌నయ్యర్ (జర్నలిస్టు) OPDR, APCLC లాంటి పౌర, ప్రజాస్వామ్య సంఘాలూ ఉండాలి. ఈలోగా....

1. హత్యానేరం కింద బాబాను ఆయన ముఖ్య అనుచరులనూ అరెస్టు చేయాలి.
2. స్థానిక పోలీసు అధికారులందరినీ బదిలీ చేయాలి.

విచారణాంశాల్లో బాబా మహత్తులోని సత్య నిరూపణ కూడా ఒక అంశంగా వుంచాలి. ఆయన మహత్తుకి పరీక్షగా జూన్ 6వ తేదీ రాత్రి ప్రశాంతి నిలయంలో జరిగిన సంఘటనలను సినిమాలాగా విచారణ బృందానికి బాబా చూపించాలి.

— దివికుమార్

అధ్యక్షుడు

అరుణోదయ

(విప్లవ సాంస్కృతిక సంస్థ)

ఉయ్యూరు

23-6-93

**15 జులై 1993 గరిమెళ్ళ శతజయంతి సందర్భంగా:-**

## “రాజ్యమేలెదము ! రారా !!”

— ఛాయరాజ్

వ్యక్తి భావాలు సమష్టి భావాలుగా రూపొంది చెందడం, అవి అప్పటి సమాజం కన్నా భిన్నమైన నూతన సంస్కృత సమాజావిర్భావానికి తోడ్పడటం జరగాలి. వాటినే సంస్కృతి భావాలంటారు. అవి వ్యక్తికి బయట వుండవు, పెనవేసుకుని వుంటాయి. కాబట్టి అట్లాంటి వ్యక్తులను మహోన్నతులంటాం. వారే త్యాగాలు చెయ్యగలరు. పోరాట కాలంలో త్యాగానికి ఫలితం ఆహుతి. ఆహుతి అంతిమ గుణం అమరత్వం. అమరులు సాహసికులు. ఎందరో మహామహుల బలిదానాలు భారత సమాజ పరిణామానికి సోపానాలయ్యాయి. అధిరోహించాల్సింది యింకా ఎంతో ఎత్తులో వుంది. సంఘర్షణలు కొనసాగుతూనే వున్నాయి. అవి మరింత తీవ్రతర మవుతున్న క్రమంలోంచి ఒక గుణాత్మకమైన మార్పు ద్యోతకమవుతోంది. అదేమిటంటే - కొందరు వ్యక్తులు మహామహులయ్యే పరిస్థితి దాటి, ప్రజలే మహానుభావులై, ఉమ్మడి త్యాగాలతో, బలిదానాలతో వ్యవస్థను మార్చే క్రమాన్ని వేగిరపరుస్తున్నారు. ఇలాంటి పరిస్థితులలో మేధావుల కర్తవ్యం నిర్దేశింపబడాలి. నిజవీరులైన ప్రజలు మరింత బల సంస్ఫూర్తులై ముందుకు నడవడానికి తోడ్పడే శక్తివంతమైన సాంస్కృతికోద్యమాన్ని నిర్మించగలగాలి. మహోన్నతమైన ప్రజల గత త్యాగాల చరిత్రను నేటి ప్రజలకందించి, వారు మరిన్ని త్యాగాలు చేసేందుకు వేగిర పడేట్లు చేయాలి. సాహిత్యమూ కళలూ ప్రజలకు అన్నం అంత స్పష్టంగా అర్థమయ్యేట్లు రూపొందించుకోవాలి. ప్రజల ఉద్యమాలకు పోషక విలువలు కలిగిన చైతన్యాన్ని పంచాలి.

ఈ నేపథ్యంలో భారత జాతీయోద్యమ చరిత్రను పరిశీలిస్తే - దేశ దాస్య శృంఖలాలను తెంచేందుకు బ్రిటిష్ పాలకుల పాశవిక పాలనను అంతమొందించేందుకు త్యాగాలు చేసిన మహామహులెందరో చరిత్రలో మనకి కనబడతాయి. వారందరికీ ఉద్యమాభివందనాలు మొదట సమర్పించుకొన్నాకనే అందులో ఏ ఒక్కరి గురించైనా ప్రత్యేకంగా ప్రస్తావించడం గౌరవప్రదమైన పద్ధతి.

భారత “స్వాతంత్ర్య” ఉద్యమంలో తమ సర్వస్వాన్నీ త్యాగం చేసిన ఆంధ్రులెందరో వున్నారు. వారిలో గరిమెళ్ళ సత్యనారాయణ అగ్రభాగాన నిలుస్తారు. సమరయోధుడే కాదు - జాతీయ గేయకవి గరిమెళ్ళ. స్వాతంత్ర్య సమరానికి తమ సర్వస్వాన్నీ ఒడ్డి, తమ రచన ద్వారా భావ సమైక్యతను ప్రోత్సహిస్తూ —

"మాకొద్దీ తెల్ల దొరతనము— దేవ.

మాకొద్దీ తెల్ల దొరతనము"

అంటూ గళమెత్తి తన పాటను తానే పాడుకుంటూ బ్రిటిష్ పాలకుల గుండెల్లో దడ పుట్టించాడు గరిమెళ్ళ.

భావ కవితా వికాస కాలమది. కవులు అంతర్ముఖులై తమ హృదయ భారాన్ని దింపుకొనే కాల్పనిక కవితా ప్రకటనలో తలమునకలై వున్నారు. అప్పు డప్పుడూ మేల్కొని, అడపా దడపా ఒకటి రెండు మార్లు జాతీయోద్యమానికి స్పందించిన దాఖలాలు వున్నప్పటికీ, వారు భావ కవులుగానే మిగిలిపోయారు. తెలుగుదేశంలో భావ కవితోద్యమానికి సమాంతరంగా జాతీయోద్యమ కవిత నడిచింది. జాతీయోద్యమ కవితకు మకుటాయమానం గరిమెళ్ళ "మాకొద్దీ తెల్లదొర తనం"- తెలుగునాట ఈ పాట పాడడం రానివారెవ్వరూ లేరనడం అతిశయోక్తి కాదు. అప్పుడే మాటలు నేర్చుకొంటున్న పిల్లల నుండి శతాధిక వృద్ధుల వరకూ, నిరక్షరాస్యులైన ప్రజలందరరకూ ఈ పాట పాడడం తెలుసు. త్రిపురనేని "వీర గంధము తెచ్చినారము - వీరులెవ్వరు తెల్పుడీ," కవితకు కూడా అంతటి ప్రచా రమూ వున్నట్టు తెలుస్తోంది. చిలకమర్తి బసవరాజు, మాధవపెద్ది మొదలైన వారి కలాల నుండి వెలువడిన గేయాలు ఎంతో ఉత్తేజాన్నిచ్చినా "మాకొద్దీ తెల్ల దొర తనం"తో సమానం కాలేకపోయాయి. ఈ పాట భాషల అవధులను దాటి, భారత దేశమంతటా పాకింది. ఈ పాట పల్లవిని యితర భాషా గేయాలందుకొన్నాయి. ఈ పాటను గరిమెళ్ళ గళమెత్తి ఎక్కడ పాడినా శ్రోతలు ఉద్రేక పూరితు లయ్యే వారు.

ఈ విధంగా చూసినప్పుడు జాతీయోద్యమ కవితకు గరిమెళ్ళ పాట "మాకొద్దీ తెల్లదొరతనం" నాయకత్వం వహిస్తుంది. జాతీయోద్యమ కవితోద్యమా నికి నాయకుడు గరిమెళ్ళ సత్యనారాయణ. ఇక్కడ దేశభక్తి గేయ రచయితకు ఆద్యుడు గురజాడనూ, ఆ తరువాత రాయప్రోలును గుర్తుకు తెచ్చుకొనక తప్పదు. జాతీయోద్యమాన్ని ముందుకు నడిపించడానికి సహకరించే వస్తువుతో వున్న గీతాల్నీ దేశభక్తిని మాత్రమే ప్రబోధించే వస్తువుతో వున్న గీతాల్నీ వాటి లక్షణాల్ని బట్టి కన్వీనియన్సుకోసం వేరుచేసి చూసి, గరిమెళ్ళ ప్రాముఖ్యతను తెలుపుతున్నపుడు ఏ విధమైన అపోహలకు తావుండదని నా నమ్మకం. జాతీయోద్యమ గేయరచన వల్లా పోరాటం వల్లా జైలుశిక్ష అనుభవించిన వారిలో గరిమెళ్ళ మొదటివారని చెప్పవచ్చును. పాట, పాటరాసిన కవి, పాట పాడిన గాయకుడు గరిమెళ్ళే కాబట్టి- నిషేధం, నిర్బంధం, కష్టం - అన్నీ గరిమెళ్ళకే చెందాయి. 1921లో ఆనాటి రాజమహేంద్రవరం కలెక్టర్ బేకన్ "మాకొద్దీ తెల్ల దొరతనం" పాటను గరిమెళ్ళ

చేత పాడించుకొని "భాషలాని నాకే గగుర్పాటు కలిగించింది. ఇక దేశీయుల్లో ఎంత ఉత్తేజం కలిగిస్తుందో అర్థమైంది." అంటూ 124-A సెడిషన్ చట్టం కింద అరెస్టు చేయించి కఠిన కారాగార శిక్ష విధించాడు. 1922లో గరిమెళ్ళ "స్వరాజ్య గీతములు" రెండు భాగాలుగా ప్రచురితమయ్యాయి. ఫలితంగా రాజద్రోహ నేరం కింద మళ్ళీ కఠిన కారాగార శిక్షకు లోనయ్యాడు. ఆ సందర్భంగా గరిమెళ్ళ ఆంధ్రుల కిచ్చిన సందేశాన్ని "ది హిందూ" 1922 ఫిబ్రవరి 11 సంచిక ప్రకటించింది.

"నా గళాన్నీ, కలాన్నీ ఒక ఏడాది పాటు జోగొడదాసుని బ్రిటిష్ నిరంకుశ పాలక వర్గం నిర్ణయించింది. పౌర జీవిత ప్రశాంతికి అంటే తమ మనుగడకే ప్రమాదకారినని భావించింది. ఇది నాకే కనువిప్పు అవి నాగురించి అనుమానించిన విధంగా నేనలాంటివాణ్ని అయితే, అది నన్ను చాలా ఆలస్యంగా పట్టుకొంది. నాలో ఉత్తమోత్తమమయినదాన్ని నా దేశానికి సమర్పించాను. నా శరీరాన్ని నిర్బంధించి వుంచుతారు. గాని సాహిత్యం ద్వారా నా ఆత్మను దేశం మీదికి వదిలేశాను. దాన్ని సమాదర్చండి, పటిష్టం చెయ్యండి, నిర్వర్తించండి. ఈ నా దుర్బల దేహం కంటే అదే ఎక్కువ పనిచేస్తుంది. మన స్వేచ్ఛను నిషేధాల ద్వారా నోరు నొక్కి రోజులు గతించాయి. స్వయంగా కాకుండా గేయరూపంలో నా ప్రజానీకంలో సంచరించాలని కోరుకుంటూ ఉండేవాణ్ని. ప్రజలు ఈ అవకాశాన్ని వాడుకోవాలేగాని ప్రభుత్వమే దాన్ని కలుగజేసింది."

ఈ సందర్భంగానే "జన్మభూమి (8-8-1922)" తన ఆవేదనను యిలా వ్యక్తపరచింది—

"ఈ ఘోరశిక్షను ఆంధ్రదేశమెట్లు ఆచరించును. పనిబాలురకు, ప్రచారకులకూ, కడకు భిక్షకులకు గూడా సత్యనారాయణ గారి గీతములు కంఠోపాఠములుగా వచ్చెను. వీధులలో భిక్షగాండ్రు, గృహములలో బాలికలు, పొలములలో పశువుల కాపరులు ఉత్సాహముతో ఈ పాటనే పాడుచున్నారు."

గరిమెళ్ళ స్వరాజ్యగీతములే గాక భక్తిగీతములు, బాలగీతములు, హరిజన పాటలు ప్రచురించారు. జైల్లో "నడియార్" అనే నీతి గ్రంథాన్ని ద్రవిడ భర్తృహరి పేరున, "కురళ్"ను 'అర్థత్రయ సర్వస్వము' అనే పేరున తెలిగించారు. ఇంగ్లీషులో "హార్ట్ ఆఫ్ ది నేషన్" అనే పద్య కావ్యం కూడా రచించారని చెబు

1933లో బతుకు తెరువు కోసం మద్రాసు చేరి దేశతి గారి "గృహలక్ష్మి" సంపాదకునిగా, రంగాగారి "వాహిని"కి, "ఆంధ్రప్రభ" దిన పత్రికకు సహాయ సంపాదకునిగా పని చేశారు "ఆనందవాణి"కి సంపాదకునిగా పని చేశారు. కృష్ణా

పత్రిక, త్రిలింగ, ఆంధ్రప్రభల్లో అనేక వ్యాసాలు రాశారు. దుందుభి, వికారి అనే కలం పేరులను ఉపయోగించారు.

అధికార మార్పిడి జరిగిన తర్వాత కాంగ్రెసును తీవ్రంగా విమర్శిస్తూ వ్యాసాలు రాశారు. స్వాతంత్ర్యోత్సవాలకు సంబంధించి "తెల్లవాడు తొలగించే పండగలేమిటి మనకి?- కాంగ్రెసుకు పట్టిన పిచ్చి ఆవేశం" అనే వ్యాసాన్ని 3-8-47 "ఆనందవాణి"లో రాశారు. పాత కాంగ్రెసు వర్కర్లే సేవకులు కావాలని 29-2-48 "ఆనందవాణి"లో రాసిన వ్యాసంలో—గాంధీ సిద్ధాంతంలో "సౌమ్యంగా ఎదిరించడం" అనేదాంట్లో రాను రాను ఎదిరించడం అనేది పోయి సౌమ్యతే మిగిలిందనీ, నికరంగా ఎదిరించిన వాళ్ళు సర్వస్వం కోల్పోయారనీ, నామ మాత్రపు ఎదిరింపు చూపిన వారు మంత్రులయ్యారనీ అన్నారు. "కాంగ్రెస్ గుజరాత్ మార్వాడీ ధనాధిష్టత విజృంభణకు లోబడి బ్రిటిష్‌వారితో అధికార్ల కర గ్రహణకు బేరం పెట్టగల ప్రతిభను సంపాదించు"కొందని ఇతర వ్యాసాలలో రాశారు.

గరిమెళ్ళ సత్యనారాయణ 1893 జులై 15న శ్రీకాకుళం జిల్లా ప్రియాగ్రహారంలో జన్మించారు. ప్రాథమిక విద్య స్వగ్రామంలోనే. పై చదువులు విజయనగరం, మచిలీపట్నంలో కొనసాగించారు. బడి పంతులుగాను, కలక్టరాఫీసులో గుమాస్తాగా కొద్దికాలం పనిచేశారు. ఉపాధ్యాయ శిక్షణకోసం రాజమండ్రి వెళ్ళి శిక్షణ మధ్యలోనే నిర్బంధానికి గురయ్యారు. 1923లో తండ్రి మరణం, 1924లో తాత మరణం, శిక్షాకాలం పూర్తయి ఇంటికి వచ్చేసరికి భార్య మరణం, అప్పులు తీర్చేందుకు కొద్దిపాటి ఆస్తులను అమ్మేయడం, పునర్వివాహం, ఆర్థిక ఇబ్బందులను తట్టుకోలేక 193?లో బతుకుతెరువు కోసం మద్రాసు చేరడం- అన్నీ ఒకదాని వెంట మరొక సంఘటన త్వర త్వరగా జరిగిపోయాయి. వివిధ పత్రికలకు బాధ్యత వహించినా, మద్రాసు ఆకాశవాణికి రచనలు పంపినా, యితర రచనలవల్లా వచ్చిన ఆదాయం అంతంతమాత్రమే. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, వావిళ్ళవారు ఆర్థికంగా సహకరిస్తూ వుండేవారు. మద్రాసు జీవితం దుర్భర దారిద్ర్యంతో గడిచింది. చివరకు తమ్ముడు రామలింగమూర్తితో కలిసి మద్రాసు మైలాపూర్‌లో హోటల్ నడిపినా బతుకు గడవలేదు. 1944లో తమ్ముడు లింగమూర్తి మరణించారు. 1946లో భార్య సత్యవతి మరణించింది. మద్రాసు వీధుల్లో నారినీ పీరినీ దేహీయని యాచించినా ఫలితం లేకపోయింది. 1948 మే 26న "నవోదయ"లో ఆంధ్రరాష్ట్ర ఎడిటర్స్ అసోసియేషన్ పక్షాన ఉపసంఘం ఏర్పాటై గరిమెళ్ళ సహాయ నిధి సేకరణకు ప్రకటనిచ్చినా ఫలితం అంతంత మాత్రమే. 1951లో గరిమెళ్ళ తల్లి మరణించింది. కంటి ఆపరేషన్ వల్ల కనుచూపు పోయింది. దగ్గుజబ్బు పట్టి

కొంది. ప్రభుత్వం దయతలచి స్వాతంత్ర్య సమరయోధుడుగా గుర్తించి పదెకరాల పొలం యిచ్చినా దాన్ని సాగుచేసే స్తోమత లేక ఏదాదో వదులుకున్నారు. అవివాహితయిన చిన్నకుమార్తె తండ్రిని కనిపెట్టుకొని ఉండకపోతే మన గరిమెళ్ళ చివరి గతి మరెంత అధ్వాన్నంగా వుండేదో!

కూడ పోతున్నారు
కూలి పోతున్నాది
ఈ మూర్ఖ బ్రిటిషు ప్రభుత్వం
మూల మట్టం తోటి

అంటూ పాడిన ప్రజాభ్యుదయుడు గరిమెళ్ళ దిక్కులేనివాడిగా డిసెంబరు 18, 1952 న కన్ను మూశారు.

మహనీయుడు గరిమెళ్ళ జీవితానికి మళ్ళిస్తూ, ఆయన జీవితకాలమంతటా ప్రపంచంలోనూ దేశంలోనూ వున్న పరిస్థితులను స్థూలంగానైనా ప్రస్తావించడం ద్వారా గరిమెళ్ళ జీవితం ఎలా విశిష్టతను పొందిందో, సామాన్య మానవుడు మహనీయుడయ్యేందుకు భూమిక ఏమిటనే విషయాన్ని గుర్తుచేస్తూ ప్రసంగం ముగిస్తాను. గతంనుండి నేర్చుకొని, వర్తమాన ప్రభావితుడై పోరాటశక్తిని పొంది, భవిషత్ సమాజ సుఖశాంతులకోసం కృషి చేసే మానవుడే ధన్యుడు.

1757 నాటికి దేశంలో ముస్లింలు స్వదేశీయులుగా స్థిరపడ్డారు. స్థానిక భారత ఫ్యూడల్ వర్గాలతో సహా ముస్లిం పాలకవర్గాలు "కంపెనీ"ల రూపంలో వున్న ఆంగ్లేయులతో పోరాడుతూనే వున్నారు. ప్లాసీ యుద్ధానంతర విజయాలతో కంపెనీల రూపంలో పరోక్షంగా అధికారాన్ని చెలాయిస్తున్న ఆంగ్లేయులు ప్రత్యక్ష పాలకుల య్యారు. ప్రజలపై పీడన అధికమయ్యింది. దేశంలో ప్రజల ప్రతిఘటనా రూపాల్లోంచి ఒక చిన్న సంఘటనగానైనా 1857 సిపాయిలు తిరుగుబాటు ఒక మైలురాయి (ఈ పోరాటాన్ని ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం అంటున్నాం) ఈ తిరుగుబాటు వేగుచుక్కయ్యింది. ప్రజల ప్రతిఘటన పెరుగుతునే వుంది. మరోవేపు ప్రపంచంలో 1871 పారిస్ కమ్యూన్ ఏర్పడడం, అది 70 దినాలలో కూలిపోవడం, తద్వారా మార్క్సిజం మరిన్ని గుణపాఠాలతో పరిపుష్టమై బొల్షివిక్కుల చేతిలో పదునెక్కి ప్రపంచ కార్మిక వర్గానికి అజ్యోతయ్యింది. ప్రపంచ శ్రామిక వర్గం మేల్కొంది. భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్యవాదులు తమ స్వార్థం కోసమైనా రైల్వేలు, కమ్యూనికేషన్లు అభివృద్ధిచేస్తూ భారత ప్రజల భావి తిరుగుబాటు ఉద్యమాలకు అనుకూలమైన భౌతిక పరిస్థితులను కల్పిస్తూ, తమ గోతిని తామే తవ్వుకొంటున్నారు. 1893 మేలో జన్మించాడు గరిమెళ్ళ. ఈతనికి 24 ఏళ్ళు వచ్చేసరికే రష్యాలో అక్టోబరు విప్లవం (1917) విజయవంతమైంది.

పొరుగుదేశమైన చైనాలో ప్రజలు జపాన్ సామ్రాజ్యవాదులను పారద్రోలేందుకు పోరాటాలు చేస్తూనే స్థానిక ప్రజా వ్యతిరేక శక్తులను కమ్యూనిస్టులు ఎదుర్కొంటున్నారు. మొదటి ప్రపంచ యుద్ధ ఫలితంగా వచ్చిన సంక్షోభానికి భారతదేశమూ గురయ్యింది. ఈ పరిస్థితుల ప్రభావాల నెవరూ అతీతులు కాలేరు. సునిశితుడైన గరిమెళ్ళ గాఢంగా ప్రభావితుడయ్యాడు. స్వార్థపూరిత జీవితం కన్న దేశభక్తి యుతమైన త్యాగమయ జీవితమే మిన్నని గరిమెళ్ళ ఎంచాడు. జాతీయోద్యమం లోని కురికాడు. డయ్యర్ జలియన్ వాలాబాగ్‌లో జరిపిన నరబలికి స్పందించాడు, చౌరీ చౌరా కాల్పులు తెలుగుదేశంలో అల్లూరి, కన్నెగంటి వీరోచిత పోరాటాలను తెలుసుకొని ఉత్తేజితుడయ్యాడు. గాంధీ నాయకత్వాన వురుకుతున్న ప్రజలతో కలిసి పోయాడు గరిమెళ్ళ. అప్పుడే పుట్టింది పాట "మాకొద్దీ తెల్లదొరతనం".

నేటికీ ప్రపంచంలో గొప్ప పాటలు రెండున్నాయి. అవి నిరంకుశ పాశవిక పాలకవర్గ రాజ్యాధికారాన్ని సవాల్ చేశాయి. మొదటి పాట యూజినీ పాటియర్ రాసిన "ఆకలి మంటల మలమలలాడే అనాధులందరు లేవండోయ్" ఈ పాట పారిస్ పాలక వర్గాల పాలనను సవాల్ చేసింది. రెండవది గరిమెళ్ళ "మాకొద్దీ తెల్లదొర తనం". ఈ పాట భారతదేశంలో బ్రిటిష్ పాలక వర్గాల రాజకీయాధికారాన్ని సవాల్‌చేసి అంతమొందించడానికితోడ్పడింది. యూజినీపాటియర్‌పారిస్‌లో దారిద్ర్యంలో తనువు చాలించాడు. గరిమెళ్ళ భారత "స్వాతంత్ర్యా"నంతర నల్లదొరల నిరాదరణకు గురై కన్ను మూశారు.

పాటను చంపలేరు. అది పరిణామం చెంది ప్రజల హృదయాలలో పెరిగి, వారి గళం నుండి పెల్లుబికి గగ్గోలు పెడుతోంది. ఆంధ్రదేశంలో ప్రజానాట్యమండలి మొదట పాటనందుకొంది. క్రమంలో జన నాట్యమండలి, అరుణోదయ జనసాహితీ సాంస్కృతికోద్యమాలు పాటనుఅందుకొని పదునుపెట్టిప్రజాతంత్ర పోరాటాలలోనికి వురుకుతున్న ప్రజల నోటికందిస్తున్నాయి. గురజాడ రచనలలోని ఆధునికతనూ నవ్య కవితారీతినీ అందుకొన్న అతికొద్ది మంది అతని వారసులలో ఆనాటికి గరి మెళ్ళ ప్రముఖుడు.

"రాజ్యమేలుదాము ! రారా!" అని ఆనాడు పిలిచాడు గరిమెళ్ళ. ఆయన ఆశయాలు నెరవేరలేదు. అందుకే ఆ మహనీయుని వారసత్వాన్ని అందుకొన్న సాంస్కృతికో ద్యమాలు మరింత బలంగా నేడు ముందుకు సాగుతున్నాయి.

(గరిమెళ్ళ శతజయంతి ఉత్సవాల సందర్భంగా, శ్రీకాకుళం జిల్లా నరసన్న పేటలో S. V. C. T సాంస్కృతిక విభాగం మరియు "శ్రీకాకుళ సాహితి"లు సంయుక్తంగా 26-5-93న నిర్వహించిన బహిరంగసభలో ప్రసంగ వ్యాసం) ●

# మరణిద్దాం అవసరమైతే

కామ్రేడ్ !
వెనుతిరగకు,
మనం పుట్టకముందే తలకు చుట్టుకొన్న
వేలకొలదీ రూపాయల విదేశీ అప్పుతో జన్మిస్తున్నాం.
తను తినడానికి తిండిలేక ఎండిన రొమ్ములతో,
బిడ్డకు పాలివ్వలేకపోతున్నానని,
పాలడబ్బా కొనలేక పుట్టినప్పటినుంచే నీకు 'పస్తు" అలవాటు చేయిస్తున్నానని,
రోదించే తల్లి కన్నీళ్ళు తాగి జీవిస్తున్నాం.
పొలం దున్నేది మనతండ్రే అయినా,
కలుపు లేరేది మన తల్లే అయినా
భూమితల్లి కడుపున కలుపు మొక్కల్లా పుట్టి,
వటవృక్షాల్లా ఎదిగిపోతున్న భూస్వాముల కాళ్ళక్రింద
పూట పూట పస్తులతో చస్తూ బ్రతుకుతున్నాం.
బందెల దొడ్లచుట్టూ ఇనుప ముళ్ళ పెన్సింగులా
ఇరవైనాలుగు గంటలూ పోలీసుల, గూండాల
పహారా పడగనీడ క్రింద నివసిస్తున్నాం
గాలి పీల్చడం,
ఆకలని అరవడం, అన్యాయాన్ని గుర్తించటం
ఎదిరించి నిలబడటం అన్నీ నేరాలే!
అనునిత్యం భయాందోళనల మధ్య జీవిస్తున్నాం.
వేసే ప్రతీ అడుక్కీ అనుమతి కోసం ఎదురు చూస్తున్నాం
ఊపిరి బిగపెట్టుకొని, క్షణాల్లెక్క పెట్టుకొనే
ఉరి తీయబోయే ఖైదీల్లా బ్రతుకుతున్నాం
వాళ్ళు చెప్పే చదువులు బానిసత్వాన్నే నేర్పిస్తున్నా
అనుమానపు కంసుడిలా, పాలకవర్గం,
దానికీ మనల్ని నోచుకోనీయకుండా
బడికెళ్ళే వయస్సులో మనల్ని
కార్ఖానాల్లోకి, పశువుల కొట్టాల్లోకి కారాగారాల్లోకి
కాంక్రీటు అడవుల్లోకి విసిరేస్తోంది
అందుకే కామ్రేడ్! వెనుతిరగకు,
నీలాగే నీ భవిష్యత్తరాలు,

ఈ నిరంతర దోపిడి పదఘట్టనల క్రింద నల్గిపోకూడదు:
ఇప్పుడిప్పుడే,
ఈ అసహజత్వంలోంచి, అనుమానంలోంచి
భయంలోంచి, ఆందోళనలోంచి,
నిరంతర ఖేదంలోంచి,
మబ్బుతెరల చాటునుండి విచ్చుకుంటున్న
వెలుతురి పుష్పంలా, ఉదయిస్తున్నాం.
'టచ్ మినాట్' కొమ్మల్లా మళ్ళీ ముడుచుకుపోవద్దు!
శతాబ్దాల పాదు మైకంలోకి మళ్ళీ ఒరిగిపోవద్దు
మార్పుకోసం పుష్పిద్దాం!
కోట్లాది ప్రజల భవిష్యత్తుకోసం విప్లవాన్ని గుబాళిద్దాం, కామ్రేడ్!
మరణిద్దాం కామ్రేడ్ అవసరమైతే,
శ్రామిక మానవాళి సుఖజీవనం కోసం.

— భైరవి

---



# ఎవరి పేరు ఎక్కడ?

— స్వామి

ముసలప్ప చేతిలోని గుమ్మడికాయ చూసేసరికి పాండురంగారావు మొగం కూడా గుమ్మడికాయంత అయె.

పాండురంగారావుది కూడా ముసలప్ప ఊరే! ఆ ఊరికి పాండురంగారావు పెద్దసాయన కరణంగా పనిచేసిండె. ఉమ్మడి కుటుంబం నుండీ విడిపోయే టప్పటికి పాండురంగారావు భాగానికి నూరు ఎకరాల చేను సంక్రమించి ఉండె కానీ, ఆయనకు ముగ్గురు చెల్లెళ్ళు ఉండిరి. వాళ్ళకు పెళ్ళి-పేరంటాలు జరిపే బాధ్యత పాండురంగారావు మీదనే ఉండె. ఉద్యోగస్తులకు ఇస్తే ఆడపిల్లలు సుఖపడతారు అనుకుని ముగ్గురు చెల్లెళ్ళకూ టౌను సంబంధాలే తెచ్చె.

పది ఎకరాలు అమ్మి పెద్ద చెల్లెలును ఒక రివెన్యూ ఇనస్పెక్టరుకు ఇచ్చి పెళ్ళి చేసె.

ఇరవై ఎకరాలు అమ్మి రెండో చెల్లెలును డి.ఆర్.డి.ఎ లో పనిచేసే క్లర్కుకు ఇచ్చె.

పదహైదు ఎకరాలు అమ్మి మూడో చెల్లెలును ఒక లెక్చరరుకు ఇచ్చి పెళ్ళి చేసె.

బాపనోల్లలో కట్నాలు ఎక్కువ కదా! అందుకని వాళ్ళ కట్నకానుకల కోసం నలభై అయిదు ఎకరాల భూమిని తెగనమ్మక తప్పలే. కానీ; ఆడపడుచులకు అన్యాయం చెయ్యలేదు పాండురంగారావు అని నలుగురిలోనూ మంచి పేరు తెచ్చుకుండె.

ఇంక యాభై అయిదు ఎకరాలు మిగిలి ఉండె.

రైతుల్తో వానలు చెలగాటం ఆడతాండె.

'పాలు లక్ష్మీదేవితో సమానంరా! పాలను అమ్ముకునే దేశంలో వానలు ఎట్ల పడతాయి?' అని ఆ బాపన సామి రైతుల్ని నిలదీస్తాండె.

తమ ఇంటికి కరణం పని పోయినంక మనుషులు చేతికి చిక్కేది గగనమై పాయ.

బాపనసామి ఇంట్లోనేమో నడుం వంచి పని చేసేవాళ్ళు లేకపోయిరి.

ఇంట్లో పనిచేసేవాళ్ళు ఉండే తప్ప సేద్యం గిట్టుబాటు కాని పరిస్థితులు వచ్చె.

కూలి మడకల్తో చేయించే సేద్యం కూళ్ళకే సాల కొస్తాండె.

'ఛల్! మా బాపనోల్లకు సేద్యం

అచ్చిరాదు' అనుకుని యాభై అయిదు ఎకరాల చేనునీ కోర్లుకు ఇచ్చి కూర్చుండె.

పిల్లోల్లు పెరిగి పెద్దగ అయితాండిరి. వాళ్ళ చదువులు గురించి దిగులు కలుగుతాండె.

'వీళ్ళ భవిష్యత్తు ఏమిటబ్బా' అని చింత చేస్తాండె.

'మీరంతా బాగా చదువుకుని మంచి ఉద్యోగాలు తెచ్చుకోవల్ల నాయనా' అని పిల్లోల్లకు నూరిపోస్తాండె.

వాళ్ళ చదువుల కోసమే పల్లెను విడిచిపెట్టి పేటలో కాపురం పెట్టె.

పదహైదు ఏండ్లు జరిగిపాయ.

పిల్లోల్లేమో చదువుకుండిరి.

యాభై అయిదెకరాల చేనేమో అయిదెకరాలకు తరిగిపాయ.

'భూమి లేనివాళ్ళము నీ భూమిని కోరుచేసి నాలుగు గింజలు పండించుకుంటాంటిమి. నీ భూమినంతా అమ్ముకుని తిని మా నోట్లో మట్టి కొడితివి కదా సామీ!' అని అప్పుడప్పుడు ముసలప్ప బాపనసామిని దెప్పుతాండె.

'పిల్లోల్లకు భూమిని మిగిలించకపోతివి కదా సామీ!' అని అంగలారుస్తాండె.

'నాకు ఉన్న ఆస్తిపాస్తులు భూమి కాదురా.... పిల్లోల్లు! వాళ్ళ చదువుకుని ఉద్యోగాలు చేస్తే అదే నాకు ఆస్తి?' అని పాండురంగారావు నవ్వుతాండె.

భూమి పోయినా; పాండురంగారావు అంటే ముసలప్ప భక్తి చూపుతాండె.

ముసలప్ప అంటే పాండురంగారావు కూడా ఎంతో అభిమానంగా ఉంటాండె.

'ఎక్కడిదిరా ఇది?' అని అడిగె- ముసలప్ప చేతుల్లోంచి గుమ్మడికాయను ఆప్యాయంగా అందుకుని పాండురంగారావు.

'నా మనుమడు మాగుడిసె పైకి ఒక తీగను అల్లించిఉండె సామీ. దానికి కాసింది!' అని చెప్పె ముసలప్ప.

'గుమ్మడికాయకే ఇంత సంబరమా ఈ వెర్రి బాపనయ్యకు' అని అనుకుండె మనసు లోపల.

'భలే ఉందిరా! ఇది బూడిద గుమ్మడి కాయ! చానా నాణ్యమైన జాతిది?'— అని చెప్పి — 'ఏమే! ఇట్లారా! మన ముసలప్ప ఏం తెచ్చినాడో చూడు' అని వరండాలోనుంచీ కేకపెట్టె.

లోపలినుంచీ తడిచేతులు కొంగుకు తుడుచుకుంటా వచ్చె సుభద్రమ్మ.

'గుమ్మడి కాయనా?' అని అబ్బురంగా దాన్ని చేతుల్లోకి తీసుకుండె.

'మీ స్వామికి గుమ్మడికాయ ఒడార అంటే చానా ఇష్టం ముసలప్పా!' అని మురిపెంగా భర్త పక్క చూసినగె.

'వారం దినాలనుంచీ తిరుగుతున్నాడు దీనికోసం! మొన్న ఏం జరిగింది అనుకుంటివి? ఇంట్లో అందరికీ పొట్లకాయ బజ్జీలు తిన బుద్ధి అవుతా ఉన్నింది. మార్కెట్టులో చూస్తే పొట్లకాయలు లేవు. ఎట్లబ్బా? అని చింత చేస్తాంటే — ఆ దేవుడే పంపించినాడు అన్నట్లు పొట్లకాయల్ని ఏకంగా మన ఇంటి ముందుకే మోసుకొచ్చె ఒక కూరగాయల అయమ్మ' అని చెప్పుకొచ్చె.

'నిన్న వారం నువ్వు సంతకు వచ్చి

నప్పుడు ఒకసారి ఇంటికివచ్చి తొంగి చూసిపోరాదేమో అనుకుంటిమిరా! పరం కాయతో హల్వా చేసిఉండె మీ అమ్మయ్య. ఖరే కుదిరిందిలే! పాపం! నీకు తినే దానికి ప్రాప్తం లేకపాయ' అని పాండురంగారావు తన పెద్ద బొజ్జ నిమురుకుంటా జాలిపడె.

నిన్న పచ్చి అరటికాయలు వస్తే తీసుకుని వడియాలు చేసింటి. అవంటే మా పెద్దకొడుక్కు చానా ఇష్టం. ఉండు ముసలప్పా! మిగిలి ఉంటే తెస్తాను' అంటూ గుమ్మడికాయతో లోపలికి పాయ సుభద్రమ్మ.

వాస్తవానికి ముసలప్పకు కూడా— 'వీళ్ళు ఏం పెడతారా? మనం ఏం తిందామా?' అన్న ఆలోచన ఒక అల వాటుగా మారిపోయి ఉండె.

'నాతో ఏదో పని ఉందని చెప్పి పంపినావంట కదా సామీ ఏం పని?' అని విషయంలోకి వచ్చె.

'అదా ...డబ్బుకు అవసరమొచ్చిం దిరా. ఆ మిగిలిన అయిదెకరాల భూమినీ అమ్మేయల్ల అనుకుంటా వుండాను' అనె—ఒకసారి తలపైకెత్తి ఆకాశం లోకి చూసి పాండురంగారావు.

ముసలప్ప పాండురంగారావు మొగం లోకి పరీక్షగా చూసె. భూమిని అమ్మ వలసి వస్తుందే అన్న చింత ఆయన మొగంలో మచ్చుకు కూడా కనపడలే!

'దుడ్లు ఉంటే నీ చేతుల్లో నిలవవు సామీ! భూమి అయితే ఎన్నాళ్లయినా పడి ఉంటుంది. నీకు ఎప్పటికయినా అక్కరకొస్తుంది. ఆ అయిదెకరాలైనా నిలుపుకో!' అని చెప్పె.

'అక్కర వచ్చింది కాబట్టే భూమిని అమ్మాల్ల అనుకుంటాండానురా! పెద్ద పాపకు ఒక మంచి సంబంధం వచ్చింది. ఆభూమిని అమ్మి పెండ్లి చేయల్ల అను కుంటాండాను' అనె.

'నిరుడు అయిదు ఎకరాలు అమ్మిం దేది పాప పెండ్లి కోసమే కదా సామీ! ఆ దుడ్లు ఏమాయ?' అని అడిగె.

'మా రెండోవాడు ప్రసాదరావు ఉన్నాడు కదా? వానికి బి.టెక్ చదవల్ల అని ఆశ. అందుకని యాభై వేలు డొనే షన్ కట్టి, వాన్ని కర్నాటక కాలేజిలో చేర్పిస్తి, పెళ్ళికంటే చదువే ముఖ్యం కదా!' అనె

'పిల్లోని చదువు కోసం యాభై వేలు ఖర్చు పెడితినా ?' అని నోరు వెళ్ళ బెట్టె ముసలప్ప.

అదేం సదువు సామీ?' అని పైమీది వెంట్రుకలు నిక్కబొడుచుకుంటూ ఉండగా అడిగె.

'అదేరా! పెద్ద పెద్ద బిల్డింగులూ, ప్రాజెక్టులూ కడతారు చూడు, ఆచదువు!' ఒక పది నిముషాలసేపు పాండురంగా రావు వర్ణించి వర్ణించి చెప్పె.

'పెద్ద పాపకు ఇప్పటికే ఇరవై అయిదు ఏండ్లు దాటినాయి. ఇంక అల స్యం చెయ్యకూడదు. ఆ అయిదు ఎక రాలు అమ్మి ఈ సంవత్సరం లోపల పెండ్లి చేసేస్తాను' అని ఖండితంగా అనె.

నీ ఇష్టం సామీ! నేను ఏం చెప్పేది?' అనె ముసలప్ప.

'అసలు ఈ పొద్దు నిన్ను పిలిపించి ఉండేది ఎందుకనుకున్నావు?' అని అడిగె పాండురంగారావు.

'ఇంతవరకూ నా భూమిని ఎవరెవరికో అమ్మేస్తి. ఈ అయిదెకరాల భూమి చెక్కని కూడా ఎవరికో అమ్మివేస్తే దానికి నా మనసు ఒప్పడం లేదురా! ఎన్నో ఏండ్లు నా భూమిని నమ్మకంగా కోరు చేస్తివి. మా తండ్రి తాతల కాలం నుంచీ మా కుటుంబానికి ఎంతో విశ్వాసంగా ఉంటివి. ఈ అయిదెకరాలైనా నువ్వు తీసుకోరా! నా మనసుకు తృప్తి' అనె పాండురంగారావు.

'నేనా?' అంటూ నోరు వెళ్ళబెట్టె ముసలప్ప.

'పుట్టగోసికి గతిలేని నా కొడుకుని! అన్ని దుడ్లు నాకెక్కడివి సామీ?' అనె.

'ఏమోరా. నువ్వు ఏం తిప్పలు పడతావో ఏమో నాకు తెలీదు. నరసిమ్మలు నాయుడు ఆ అయిదెకరాలనీ నలభై వేలకు అడిగె. నీకైతే చూడు. రెండు మూడువేలు తగ్గించి ఇస్తాను' అనిచెప్పె.

'అయిదెకరాలు నలభై వేలుమాత్రమే. చానా చానా అగ్గువ, పైగా తనకైతే రెండు మూడు వేలు తగ్గించుకుంటానంటాండాడు' అని ఆశ్చర్యపుట్టి ముసలప్ప ఒణికె.

ముసలప్పకు గొర్లూ, మేకలూ ముప్పైదాకా ఉండె.

'సేద్యంపని ఎంత బరువైనా చేస్తాను గానీ ఆ మేకల్లోకి మాత్రం నన్ను పొమ్మని చెప్పొద్దు. ఎండనక వాననక దాన్ల వెంటపడి మేపుతా.... ఆతిప్పలు నేను పడలేను.' అని కొడుకు గిరెప్ప మాట్లాడే మాటలు గుర్తుకొస్తాండె.

తనకూ వయసు పైబడి మోకాళ్ళ నొప్పులొచ్చె. మునుపటి మాదిరి మేకల వెంట కొండలూ గుట్టలూ అరిగే ఓపిక లేకపాయ.

తను కాలమైపోతే గిరెప్ప ఇప్పటి మాదిరే కూలీ నాలీ చేసుకుని బతుకుతాడు గానీ, సస్తే మేకల్లోకి పోడు' అని నిర్ధారించుకుండె.

'బాపన సామి అమ్మజూపే ఆ అయిదెకరాలూ మేలు భూమి కాకపోవచ్చు. చౌడు భూమే కావచ్చు. కానీ రెండు మూడేండ్లు కష్టపడి సాగులోకి తెచ్చుకుంటే బంగారం పండుతుంది. తన కొడుకూ, మనుమలూ కూడా ఆభూమితో సేద్యగాళ్ళ అనిపించుకుంటారు కానీ దుడ్లు ఎట్లా?' అనుకుండె.

'రెండు వారాల తరువాత నాకు ఏ మాటా చెప్పు. అవతల నరసిమ్మలు నాయుడు భూమి కోసం ఒకటే తొందరిస్తాండాడు' అనె పాండురంగారావు.

'తొందరించడా మల్ల? ఎకరా పదుహైదు వేలు ధర పలికే ఈ రోజుల్లో అంత అగ్గువగా దొరికే భూమిని ఎవరు మాత్రం వదులుకుంటాడు?' అనుకుండె ముసలప్ప.

బాపనమ్మయ్య తెచ్చిపెట్టిన అరటి కాయ వడియాలని కరకరా నముల్తూ ఆలోచించబట్టె.

ం ం ం

మూడు దినాల నుంచీ ముసలప్ప

మనసు మనసులో లేకపాయె.

బాపనసామి భూమిని అమ్మే విషయం కొడుక్కు చెప్పుదామని నోటిదాకా వచ్చె. కానీ—'చెప్పినా ఏం లాభంలే! నాకు తెలీకుండా వాని దగ్గర మాత్రం నలభై వేల దుడ్లు యాడ ఉంటాయి పాపం' అనుకుంటె.

ఒక్కడే చింత చేయబట్టె.

నలభై వేలు గురించి చింత చేస్తాం డగా - తమ ఇంటి ఖర్చులన్నీ భూతద్దంలో కనఃడబట్టె. ఇంట్లో - తన కొడుకూ, కోడలిమీద ఊరి కూరికే చీదర కలుగుతాండె.

'దినానికి కట్ట బీడీలు తాగితే ఎట్ల?' అని ఒక దినం కొడుకు మీద పడె.

'కూరల్లోకి ఇంతింత నూని పోస్తే ఎట్ల? వంకాయల్ని ఇడిసిపెట్టి పరుగెత్తాంది చూడు నూని. సంసారాన్ని పొదుపుగా నడుపుకోవల్ల అని తెలీదా? అని కంచం ముందు కూర్చుని ఒకదినం కోడలి మీద అగ్గి కురిసె.

'కాఫీ చెయ్యొద్దు అంటే చేస్తారు! బెల్లం రేటు ఎట్లుంది? కాఫీపొడి రేటు ఎట్లుంది? ఎంత ఖర్చూ, ఏంకత? పిల్లోల్లు పెద్దగ అయితాండారు. వాళ్ళ కోసం నాలుగు దుడ్లు ఎనకేసుకోవల్ల అనే జ్ఞానం లేదు మీకు' అని ఒక దినం ఇద్దర్నీ కలిపి తిట్టె.

ముసిలోని రాపిడికి తట్టుకోలేక ఆ ఇంట్లో కాఫీ తాగేదే ఇడిసిపెట్టిరి.

నాలుగైదు దినాలు గడిచె.

ముసలప్ప—'ఎంతో బుద్ధిమంతుడైన నా కొడుకు మీద ఊరికూరికెనే నోరు పారేసుకుంటికదా!' అనుకుండె.

'బంగారం లాంటి నా కోడల్ని అన్యాయంగా అడిపోసుకుంటికదా' అనుకుండె.

'నలభైవేల దుడ్లు నాకు కలలో మాట' అనుకుండె.

'ఇంక భూమి గురించి యోచనే పెట్టుకోకూడదు' అనుకుండె.

'ఆ మాటనే బాపనసామికి చెప్పి రావల్ల' అని ఒక పొద్దున సీద నిశ్చయం చేసుకుండె.

'ఒరే గిరెప్పా! మన సామితో కొంచెం మాట్లాడేపని ఉంది. పేటకు పోయొస్తాను. ఈ పొద్దు జీవాల్లోకి నువ్వే పోరా!' అని చెప్పె.

'నాకెక్కడ అయ్యతుంది నాయనా? రెడ్డి తోటలోకి కూలికిపోవల్లకదా నేను?' అనె గిరెప్ప.

రాత్రి పండుకున్న చిరుగుల చాపను ఇడిసిపెట్టి రుబ్బు గుండు పక్కకు పొర్లి నిద్రపోతున్న పెద్ద మనుమని పక్క చూసె ముసలప్ప.

'అయితే ఈ ముక్కన్నగాన్ని లేపు పాపా! వీన్నే పొమ్మను ఈ పొద్దు జీవాల్లోకి' అని చెప్పె కోడలితో.

ఆయమ్మ మొగం గంటుపెట్టుకుండె 'మొన్న వాళ్ళ అయ్యగారు ఇంటికొచ్చి అరిసిపాయ మామా? మీ పిల్లోనికి మంచి తెలివి ఉంది వాన్ని సరిగా బడికి పంపించకుండా మీరే పాడుచేస్తున్నారు అని అరిసిపాయ' అని చెప్పె.

'ఏం చేయల్ల పాపా? నేనేమో పేటకు పోవల్ల. నీ మొగుడేమో కూలికి పోవల్ల.

నువ్వేమో నిండు గర్భినివి. ఎట్టమల్ల ? ఈ పొద్దుకు ఎట్లో వాన్ని పంపియ్యి' అనె ముసలప్ప.

'ఈ పొద్దు మాత్రమే ? ఈ పొద్దు మాత్రమే అని అనుకోబట్టే వాని సదువు అటకెక్కె' అని మూతి ముడిచె కోడలు.

'మన బాపనసామి అట్లా వాళ్ళకి సదువులు ? మన అట్లా వాళ్ళకి యాడ అబ్బుతుంది పాపా ? తలకు ఒక పని చేసుకోకపోతే మనకు కూటికి జరిగేదే కిష్టం. అయినా లోకంలో అందరూ పల్లకి ఎక్కుతామంటే దాన్ని మోసే దెవరు పాపా ?' అని మొగం కడుక్కుండే దానికి బైటికి పాయ.

కొడుకు సదువు సట్టుబండలవుతాం దని లచ్చుమక్కకు కడుపులోమంటపడ తాండె. కానీ ఆ కోపాన్నంతా మామ దగ్గర పెళ్ళగక్కలేకపాయ.

సరసరాపోయి, నోరు తెరుచుకుని నిద్రపోతున్న కొడుకును ధబీమని గుద్దె. వాడు 'అమ్మా'అని అరిచిలేచికూర్చుండె. వానికి ఏదో పీడ కలలోకి మేలుకున్నట్ల ఉండె.

మొగుడు గిరెప్ప అడ్డుకోబోతుండగా 'శని నా కొడకా ? పో! పోయి మొగం కడక్కరాపో. జీవాల్లోకి పోవల్లంట! నీ సదువు-సంకనాకినట్లే ఉందిపో!' అని ఇంకోరెండు పిడిగుద్దులు గుద్దె. పొద్దున్నే తల్లి యాల కొడతాందో వానికి అర్థం కాలే! నిద్ర మంపరంలోనే పెడబొబ్బలు పెట్టుకుంటా పారిపాయ.

కొంచెం సేపు జరిగె.

కడుపులో పేగులు అరుస్తాంటే మెల్లగా ఇంటికొచ్చి మొగానికి ఇన్ని నీళ్ళు సల్లుకుండె ఆ పిల్లోడు.

తల్లి ముద్ద గెలికే టయానికి పిల్లి మాదిరి వచ్చి దడివారగా కూర్చుండె. మెల్లగా లేచి తట్ట తీసుకుని దగ్గర పెట్టుకుండె; కొడుకు పక్క చూసీ చూడకుండా చూసి—'పిల్లోన్ని అన్యాయంగా కొడితి. నా చేతులు పడి పోనూ' అనుకుని లచ్చుమక్క కండ్లల్లో ఊరే నీళ్ళని చాటుగా కొంగుతో తుడిచేసుకుండె.

లచ్చుమక్క అప్పటికే పండుకారం నూరిండె. ముద్దలు కట్టి గిన్నెలోకి ఏస్తాండె.ముక్కన్న కంటే సన్నపిల్లోలు అయిన ఆడపిల్లోలు ఇద్దరూ కూడా తట్టలు పెట్టుకుని ముద్ద పక్క ఆశగా ఎదురు చూస్తాండిరి.

గిరెప్ప వచ్చి కూర్చుండె.

మొగునికి తట్టలేకపోవడం చూసి - 'నువ్వు సన్నపాప దగ్గర కూర్చో' అని చెప్పె లచ్చుమక్క.

ముసలమ్మ వచ్చి కూర్చుండె.

ఆయప్పకూ తట్టలేక పాయ.

మామ పరిస్థితిని ఒక కంట గమనించి - 'ఒసే! గంగీ ! నువ్వు మల్లా తిందువు.... ఆ తట్ట మీ తాత ముందు పెట్టు' అనె.

'అయ్యో ! తట్ట ముందు కూర్చున్న వాళ్ళను లేపకూడదు తల్లీ. నేను ముక్కన్నగాని దగ్గర కూర్చుంటానులే' అనె ముసలప్ప.

'లే ! రారా ! తట్ట జరుపు. ఇద్దరూ కూర్చుందాం' అని మనుమని పక్క నెర్లుగా చూస్తా పిలిచె.

ఆ పిల్లోడు తట్ట తీసుకుని తాత దగ్గరికి జరిగె.

లచ్చుమక్క - మూకిడిలో ఏసుకుని తిప్పి కాలే కాలే ముద్దలు తట్టె. అట్లే ఒక్కొక్కరి తట్టలోకి ఏసె ఊరిబిండి కూడా ఏసె.

మనుమడు ఆత్రంగా కాలే కాలే ముద్దను గిల్లుకోలేక అవస్థ పడ తాంటే.... 'ఉండరా! నేను గిల్లేస్తాను' అని అయిదారు ముద్ద పిడసలు గిల్లేసె ముసలప్ప.

ఆ పిల్లోడు ముద్దను నోటితో ఊపుకుని సల్లగ,జేసుకుంటాంటే—— 'యాటికి ఏసకపోతావురా జీవాలు ?' అని మనుమన్ని పరీక్ష చేస్తాన్నట్లు అడిగె.

కాలే ముద్దను నోట్లో ఎక్కువ సేపు పెట్టుకోలేక గుటుక్కున మింగి- 'మేపు యాడ బాగుంటే ఆటికి' అనె ఆపిల్లోడు.

'కిందన యాడా మేపులేదురా? కొండలోకి ఏసకపో! ఆ రాళ్ళ సందునమొలిసిందే నాలుగు గడ్డిపానలనన్నా నాక్కుని పానంపట్టుకుంటాయవి' అనె ముసలప్ప.

'ఒరే! కొండలో ఎలుగ్గొడ్డు ఉంది. రవంత నిగాగా ఉండు' అని జాగ్రత్త చెప్పె పక్కనే కూర్చున్న తండ్రి గిరెప్ప.

'నన్నేం చేస్తుందది ? కట్టె తీసుకుని నాలుగు జవిరినానంటే — సచ్చిపోతినిరా తండ్రీ అని పరుగెత్తదా?' అని ఆపిల్లోడు వీరత్వంతో అనగానే—— 'నా మనుమడు అనిపించుకున్నావురా ? మనది ఏవంశం? గండ్రగొడ్డలి వంశం! నీ ముత్తాత గొడ్డలితో పులిని సంపినాడురా! నేను ప్రాయంలో ఉండగా మసెదు గుడి ముందున్న నల్లగుండు ఎత్తి నానురా! అట్లాంటి వంశంరా మనదీ!' అని మనుమని పక్క గర్వంగా చూసుకుని మీసాలు మెలి తిప్పుకుండె ముసలప్ప.

'పెద్దగ అయనంక నువ్వేం పని చేస్తావురా' అని వాసుమన్ని మువ్వటగా అడిగె.

'నేనా ? మడక పట్టి దున్నుతాను. మడికయ్యలు తిరగ్గొడతాను. కానీ మన రెడ్డితోటలోకి మాత్రం కూలికి పోను తాతా !' అనె.

'యాలరా?' అని అడిగె తాత.

'రెడ్డి కొడుకు హనుమంతరెడ్డిగాడు ఉన్నాడు కదా? వానికి చాలెడు పొగరు తాతా! బళ్ళో కనువు కూడా నూకడు. వాని తోటలోకి సస్తే నేను కూలికి పోను' అనె.

'మల్ల ఏం చేస్తావురా ?' అని అడిగె.

'సొంత భూమి చేసుకుంటాను. నా భూమిలో నేను కష్ట పడతాను. నేను ఒక్కన్నే బాయి కూడా తవ్వుకుంటాను' అనె ఆ పిల్లోడు.

ఆ పిల్లోని మాటలకు ముసలప్ప కండ్ల నుంచీ బొటా బొటా కన్నీళ్ళు కారె.

'ఏంది నాయనా! అన్నం తట్టముందు కూర్చుని అట్ల ఏడుస్తావు?' అని తండ్రిని గదురుకుండె గిరెప్ప.

'నా మనుమనికి ఇంత భూమి సంపాదించి పెట్టకుండానే సచ్చిపోతానేమోరా నేను!' అని ఆ పిల్లోన్ని పట్టుకుని వల వలా ఏడ్చె ముసలప్ప.

'మూడు నాలుగు దినాలను ఎంచూస్తాం డాను. అనో మాదిరిగా ఉంటావు. ఇంతకూ సంగతేమి నాయనా?' అని తండ్రిని విచారించె కొడుకు.

బాపనసామి తమకు భూమిని అమ్ము తానన్న సంగతంతా చెప్పి ముసలప్ప తెరిపిన పడె. కానీ భూమి ఆలోచన అంటుకున్న గిరెప్పకు మాత్రం పురి ఎక్కె.

గిరెప్ప ముద్ద తినేది ముగించి—
చేతులు పిసుక్కొండె.
కాలు గాలిన పిల్లి మాదిరి తొక్కు లాడె.
బీడీ మింద బీడీ కాల్చె.
కాలికి చక్రం కట్టె.

'వానెక్క! వాని అలి!! హరిహర బ్రహ్మాదులు అడ్డొచ్చినా ఇట్లాంటి చాన్సును మనం ఇడిసిపెట్టకూడదు నాయనా' అని కిర్రెక్కిపోయి అరిసె.

'అయిదెకరాలు నలబై వేలు! ఇట్లా అదురుష్టం తప్పిపోతే ఇంక మన మొగాలకు ఎప్పటికీ భూమి బాగ్యం ఉండదు నాయనా!' అని హెచ్చరించె.

'రాళ్ళూ, గుట్టలూ పీకి, బండ్లు బండ్లు చెరువు మన్ను తోలి, ఆ చౌడు భూమినే బంగారట్లా భూమిగా మార్చక పోతే నా పేరు గిరెప్ప కాదు నాయనా!' అని ప్రతిజ్ఞ పట్టె.

'ఊరికే చింత చేస్తే లాభం లేదు. ఏదో ఒకటి చెయ్యల్ల.' అని పిడికిళ్ళు బిగించె.

'మన గొర్లూ, మేకలూ అమ్మితే పండ్రెండు వేలు రావా?' అని అడిగె.

'నా మెడలో తులం పైన చైను ఉంది కదా! దాన్ని అమ్మితే ఒక అయిదు వేలు రావా?' అని అడిగె లచ్చుమక్క.

గిరెప్ప పెండ్లాం పక్క మెచ్చు కోలుగా చూసి— 'పండ్రెండూ ఒక అయిదూ పదిహేడు వేలు' అని లెక్క చేసె.

'నిరుడు గొర్లు అమ్మిన దుడ్లు నా దగ్గర అయిదు వేలు ఉండాయి' అనె తండ్రి!

వెంటనే— 'పదిహేడూ ఒక అయిదూ ఇరవై రెండు' అని లెక్క చేసె కొడుకు.

'ఒక అయిదు వేలు అప్పు పుట్టించ లేమా మనం?' అని గిరెప్ప తండ్రి మొగం పక్క చూసె.

తండ్రి మాట్లాడక పోయేసరికి— 'అయిదు వేలయినా అప్పు పుట్టకపోతే మనకు ఈ ఊర్లో ఏం వేల్యూ ఉన్నట్లు నాయనా? నేను ఎక్కడో ఒక చోట తెస్తానులే!' అని తండ్రికి ధైర్యంచెప్పె.

'ఎంత? ఇరవై రెండూ ఒక అయిదూ ఎంత?' అని ఆత్రంగా అడిగె.

'ఇరవై ఏడు. ఇరవై ఏడువేలు నాయనా' అని అరిసె.

'నలబై వేలు!! అంటే ఇంకా ఎంత కాబడుతుంది నాయనా?' అని అడిగె.

'ఇంకా పదమ్మూడువేలు కావల్ల కదా! ఎట్ల నాయనా? ఏం చేయల్ల?' అని తొక్కులాడె.

'మనకైతే మూడు వేలు తగ్గించు కుంటానని చెప్పినాడు కదా సామి!' అని ముసలప్ప గుర్తు చేసె.

'రిజిష్టరు ఖర్చులకైనా ఆ మూడు

వేలూ కావలసిందే కదా! కాబట్టి ఇంకా పద్మూడువేలు కావల్ల' అనె గిరెప్ప.

నిమిషం గ చె

రెండు నిమిషాలు గడిచె.

'పద్మూడు వేలు ఎట్ల' అంటె 'ఎట్ల' అని ఆ తండ్రీ కొడుకులు మొగం మొగం చూసుకుండ్రి.

'దొంగ నోట్లు ప్రింటు కొట్టాల్సిందే' అని విరక్తిగా లేచే దానికి పాయ మునలప్ప.

'ముందు మన గొర్లూ మేకల్ని ఎవరికైనా బేరం చెప్పు. తరువాత కద తరువాత చూసుకుందాం ... నా ప్రాణమైనా తీసుకుంటానుగానీ నేను ఈ భూమిని మాత్రం ఇడిసిపెట్టేది లేదు నాయనా!' అని కొడుకు ఢంకా బజాయించినట్లు చెప్తుంటే. 'ఔరా! ఎంత ఉడుంపట్టు వీనిది!' అని అట్లే నిలబడిపాయ తండ్రి.

*　*　*

గొర్లూ, మేకలూ అమ్మిరి

లచ్చిమక్క మెడలోని చైను అమ్మిరి.

ఒక అయిదువేలు అప్పు పుట్టించిరి.

మునలప్ప దగ్గరున్న అయిదు వేలూ కలిపిరి.

అంతా కలిపి ఇరవై ఏడువేలు జత చేసుకుండిరి.

రెండు వారాలు కూడా తిరక్కుండానే అనంతపురం నుంచీ భూమిని రిజిష్టరు చేయించుకున్న పత్రాలతో తిరిగొచ్చె గిరెప్ప.

ఆ పత్రాల్ని తండ్రికి చూపె పెండ్లానికి చూపె. పదేండ్లు కూడా దాటని పెద్ద కొడుకు ముక్కన్నకు కూడా చూపె. భద్రంగా ట్రంకుపెట్టె అడుగున దాచిపెట్టె

గిరెప్ప ఈ లోకాన్నే జయించినట్లుండె.

ఇంకా చెప్పల్ల అంటే ....తల్లి ఒడి చేరుకున్న పసిపిల్లవాని మాదిరి ఆ మొగంలో సంతోషం తట్టి పడతాండె.

మన దగ్గర నలభై వేలకు ఇంకా పద్మూడు వేలుతక్కువ ఉండె గదా ! ఆ దుడ్లను యాడ పుట్టిస్తివిరా ?' అని మునలప్ప కొడుకును ఆరా తీసె.

ఎక్కడ పుట్టిస్తేనేమిలే ! భూమి మన పేర అయింది కదా !' అని కొడుకు తప్పించుకుండె.

మునలప్ప ఇడిసి పెట్టలే.

రెండు సార్లు అడిగె.

మూడు సార్లు అడిగె.

'చెప్తావా ? సస్తావా ? ?' అన్నట్లు ఒక దినం కొడుకును నిలేసి అడిగె.

గిరెప్పకు రేగె-'నేను ఒకర్ని నమ్మించి మోసం చెయ్యలే ! ఎవరింటికీ కన్నం వెయ్యలే ! నా పెండ్లాన్ని యాదాకుదువ పెట్టలే? సాలా? మల్లామల్లా అడిగినావంటే చూడు: నాకు రేగితే మనిషిని కాను' అని అరిచె.

'నా దగ్గర ఎప్పుడూ నోట్లో నాలుక లేనట్లు మసలుకునేవాడు ! ఏమయిందబ్బా వీనికి ? ఇంత గట్టిగా అరుస్తాడు!' అనుకుని అప్పటికే ఊరికే అయిపాయ మునలప్ప.

ఇంట్లో ఆవు ఈనితే ఆ ముర్రుపాలు కారియర్ నిండా పోసుకుని—' పాపం మన బాపనసామికి జున్ను అంటే చానా ఇష్టం ఇచ్చొస్తాను' అని బయల్దేరె ముసలప్ప.

కొడుకు భూమి దుడ్లు అన్నీ కట్టినదీ లేనిదీ, సామినే అడిగి కనుక్కోవచ్చు కదా ! అన్న ఆలోచనని కూడా కడుపులో పెట్టుకోనుండే.

బాపనసామి ఇంట్లో అడుగు పెట్టే టప్పటికి-లోపల వంటింట్లో నుంచే అతిరసాలు చేస్తున్న తీపి వాసనలు వస్తాందె.

'రా ! రా ! ముసలప్పా' అని పాండురంగారావు ముసలప్పను మర్యాద చేసె.

ముసలప్పకు బాపనసామి ఇంటివాతావరణంలో ఏదో మార్పు వచ్చినట్లు కనపడే.

వరండాలోకి నాలుగు కొత్త కుర్చీలు వచ్చి చేరిందె.

కాంపౌండు గోడపైన కొత్తగా వచ్చి చేరిన ఎనిమిది పూల కుండీలు వరుసగా కళకళలాడతాందె.

కొత్తగా తెచ్చిన వీణను పోటీలుపడి మీటి పగలబడి నవ్వుతాండిరి పాండురంగారావు పిల్లలు !

ముసలప్ప కారియర్ అందిస్తే చూసి 'జున్ను పాలా ?' అని అడిగి- 'ఏమే ? మన ముసలప్ప ఏం తెచ్చినాడో చూస్తురా ! జున్నుపాలు ! జున్నుపాలు తెచ్చినాడే' అని సంతోషాన్ని ఆపుకోలేక అరిసె పాండురంగారావు.

సుభద్రమ్మ వచ్చి, నవ్వు మొగంతో పలకరించి జున్నుపాలు లోపలికి తీసకపోయె. అట్లే కాలే కాలేటివి అతిరసాలు తెచ్చిపెట్టి 'తిను ముసలయ్యా' అనె.

ముసలప్ప రవంత రవంత కొరుక్కు తింటుంటే- 'సల్లగా అయితే ఇవి ఇంకా బాగుంటాయిరా !' అని ఆ అతి రసాలకు బెల్లంపాకం ఎట్ల పట్టి ఉండేదీ.... చెప్పేదానికి మొదలు పెట్టె బాపనసామి.

కొడుకు భూమి దుడ్లని ఇంకా ఎంత బాకీ పడినాడో కనుక్కోవల్ల అని ముసలప్పకు ఎంతో ఇదిగా ఉండె. 'కానీ-తన క్కూడా తెలియకుండా కొడుకు వ్యవహారమంతా నడుపు కొచ్చినాడని బాపనసామికి తెలిస్తే తన పద్దరికానికి ఎంత తలవంపులు !' అని మనసులోపల పీకుతాందె.

మొత్తానికి అట్లచేసి, ఇట్లచేసి విషయమంతా రాబట్టె. కొడుకు సామికి కట్టాల్సిన దుడ్లు అయిదువేలు మాత్రమే అని తెలిసి ఆశ్చర్యపాయ.

'మిగతా అయిదువేలను సామికి ఎట్ల కట్టి వుంటాడు ? రిజిష్టరు ఖర్చులకు అయిన మూడువేలను ఎక్కడనుంచీ తెచ్చింటాడు ? మొత్తం ఎనిమిదివేల రూపాయలు వానికి ఎక్కడివబ్బా ?' అని యోచన చేయబట్టె.

'ఈ కుర్చీలు నాలుగూ ఎనిమిదీ వందలయాబై'

'లోపల బీరువా ఉంది. అది రెండు వేలు'

'టీ.వి. తెచ్చినాను; చూస్తురా ! ఇదీ నాలుగువేలు' అని చెప్పేదానికి మొదలు పెట్టె పాండురంగారావు.

'భూమిని పెద్దపాప పెండ్లి కోసం

ఇవన్నీ యూల కొంటివి ? ఏం అవ సరం?' అని అడిగె ముసలప్ప.

పెండ్లి 'సంగతా ?' అని లేలిగ్గా దీర్ఘం తీసె పాండురంగారావు

'ఆ భూమి అమ్మిన దుడ్లన్నీ పాప పెండ్లి కోసమనే పెట్టుకోనుంటి, కానీ పాపకు ఈ ఊర్లోనే, మునిసిపల్ గరల్స్ హైస్కూల్‌లో ఉద్యోగ మిస్తామనిరి. అందుకు ఇరవై అయిదువేలు ఇమ్మనిరి. పెళ్ళికని ఎత్తి పెట్టిన దుడ్లున్నా ఉద్యోగం కోసం ఖర్చు పెడితి.

'ఒక సంవత్సర జీతం మనది కాదు అనుకుంటే- ఆ లంచమిచ్చిన ఇరవై అయిదువేలా మనకు తిరిగి వచ్చినట్ల అవుతుంది. ఇంకో రెండు సంవత్సరాల జీతం మనది కాదు అనుకుంటే.ఆ డబ్బు ఆయమ్మ పెండ్లి ఖర్చులకు సరిపోతుంది. చివరికి ఉద్యోగం లాభమేకదా !

'మూడేండ్లు కాకపోతే ఇంక అయి దేండ్లు జరిగినా పరవాలేదు. ఉద్యోగస్తురాలైన పిల్లకు ఎప్పటికైనా పెండ్లి గ్యారంటీ కదా ! అందుకని అన్నీ బాగా ఆలోచించే, ఆ ఇరవై అయిదు వేలనూ వాళ్ళ ముందు మోపిస్తి' అనె పాండురంగారావు నవ్వుతా.....!

'కాలాలు బాగలేవు సామీ ! ఆడపిల్లలకు తొందరగా పెండ్లిచేసి పంపల్ల'అని చెప్పుదామని నోటిదాకావచ్చెముసలప్పకు కానీ బాగుండదని ఊరుకుండె.

పాండురంగారావు ఇంకా చెప్పు కొచ్చె—'మా మొదటివాడుగోపాలావు ఉన్నాడు కదా ? చాలా తెలివైనోడు. ఎమ్మార్వోనో, డిటీనో అయితే ఇంక మనకు ఎదురే లేదనుకో ! మంచి ఆదాయాలున్న ఉద్యోగాలు కదా అవి!' అనె. ఆ చేతికి అంది వచ్చిన కొడుకు మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నట్లు కనపడె పాండురంగారావు.

'ఏం చదువులో! ఏం ఉద్యోగాలో!! రెక్కల కష్టం చేసి సంపాదించుకున్న భూమి అయితేకదా. సామీ, మీకు దాని విలువ తెలిసేది!' అని గొణుక్కుండె ముసలప్ప.

o o o

బాపనసామి దుడ్లు ఖర్చుచేసిన తీరునంతా కండ్లలో చూసీ, చెవుల్తో వినీ, ఇంటికి వచ్చిన ముసలప్ప - 'ఒరె గిరెప్పా! నీకు తెలుసా ఈ సంగతి ! తన పెద్ద కూతురికి పెండ్లి చేయల్ల అని కదా, ఆసామి మనకు భూమిని అమ్మిందేది! కానీ ఇప్పుడు చూడు. ఆ బిడ్డకు పెండ్లి చెయ్యకుండా ఇరవై అయిదువేలు పెట్టి ఉద్యోగం ఇప్పించినాడు. ఇంకా మిగిలిన దుడ్లకు కుర్చీలు తెచ్చినాడు. బీరువా తెచ్చినాడు టీ.వి. కూడా తెచ్చినాడు. కూతురికి పెండ్లిమాత్రం ఇప్పుడే చెయ్యడంట. ఆయమ్మ పెండ్లికి ఆయమ్మనే దుడ్లు కూడబెట్టుకోవల్లంట. ఆసామికి తిక్కనా? చాదస్తమా?' అని నవ్వబట్టె.

'ఎంత భూమీ ఏంకత ? అంతా మూడుదుడ్లకు అమ్ముకుండెసామి. కష్టం చెయ్యకుండా కూర్చుని తింటే కొటుక కొండ అయినా కరిగిపోదా?' అనె.

'గట్టి సొమ్ము అయితే కదా నిలిచే దానికి ? ఎట్ల వచ్చిందో అట్టేపోవల్లలే!' అని వేదాంతంలో పడె.

'మొత్తానికి మనిసి చానా ఉత్తముడు. కానీ సెట్రి బావనేమ్యా. ఎదిగి వచ్చిన కూతుర్లకి పెండ్లిల్లు ఎట్ల చేస్తాడో ఏమో పాపం!' అని చప్పరించె.

తరువాత మెల్లగా రంగంలోకి దిగె- 'సామికి ఇంక అయిదువేలు మాత్రమే నంట కదురా మనం బాకి! ఆ మిగతా ఎనిమిది వేలా ఎక్కడ నుంచీ తెచ్చి కడితివి!' అని మర్లీ మొదలు పెట్టె.

కొడుకు మాట్లాడలే !

'చెప్పు నాయనా! నాతో చెప్పకుండా నువ్వు ఇంత వరకూ ఏ పనీ చేయలేదు. ఆ ఎనిమిది వేలూ నీకు ఎక్కడి నుంచీ వచ్చిందో చెప్పు.' అని అనునయంగా అడిగె. కుక్కిమంచం మీద పండుకున్న పచ్చి బాలింతరాలు లచ్చుమక్క సన్నగా ఏడ్సబట్టె.పది దినాల కిందటే ఆయమ్మ- కళ్యాణ దుర్గంలోని ఒక వాలంటరీ ఆర్గనైజేషను వాళ్ళ అనుపత్రిలో పురుడు బోసుకుని వచ్చిండె.

'ఏం పాపా ? ఊరికే ఏడుస్తావు ? ఏం జరిగింది ?' అని ముసలప్ప కోడలి పక్క తిరిగె.

ఆయమ్మ గావురు మంటా ఏడ్సె.

సత్తువనంతా కూడ దీసుకుని లేచి నిలబడె.

కూలిపోతా నడిచి మామ కాళ్ళ మింద పడె.

'పాపిష్టి దాన్ని' మామా! నాకంటే గొడ్రాలు మేలు మామా ! నా అటువంటి ఆడది ఈభూమ్మీద పుట్టకూడదు మామా' అని- రెండుచేతుల్తోనూ దొమ్మలు దొమ్మలు బాదుకుండె.

తలకాయ తలకాయ కొట్టుకుండె.

నా కడుపున పుట్టిన కొడుకుని ఎనిమిది వేలదుడ్లకు అమ్ముకుంటిమిమామా!' అని అరిసె.

మనోరోగంతో ఆయమ్మ ఎండి పోయిన కట్టె పుల్ల మాదిరి అయిండె.

'పిల్లోడు ఎర్రగా బుర్రగా టమేటా పండు మాదిరి ఉండాడు. నాకు పిల్లోల్లు లేరు. సాక్కుంటాను అని ఆఇంగిలీసు డాక్టరు అడిగెనంట మామా ! నీకొడుకు ఊకొట్టెనంట మామా! అప్పుడు నాకు ఏ దయ్యం పూని వుండెనో .... నేను కూడా వద్దనకపోతిని మామా! తప్పు నాదే అనుకో మామా! నేను నీకూతుర్ని అనుకోమామా!' ఈఒక్కసారినాతప్పును కాపాడుమామా! అని గొల్లుమని ఏడ్చె.

ఆయమ్మ —

దయ్యం పట్టిన దాని మాదిరి ఉండె.

'నన్ను సంపండి. నరకండి' అని తిక్కపట్టిన దాని మాదిరి వదురుతాండె.

ఆయమ్మ కొప్పు విడిపాయ

ఆయమ్మ కన్నీళ్ళతో మామ కాళ్ళ తడిసిపాయ. బెల్లం కొట్టిన రాయిమాదిరి నిలబడి తల్లొంచుకుండె గిరెప్ప !

ముసలమ్మ - వచ్చే ఏడ్పును దిగమింగుకోవల్ల అనే అనుకుండె.

కానీ అరచేతి వేడికి వెన్న కరిగినట్ల తాత కండ్లు కన్నీళ్ళతో అలుక్కుపాయ

ఏదో మాట్లాడే దానికి పోతే గొంతు పూడక పాయ.

'తల్లీలచ్చుమక్కా! నాయనా గిరెప్పా! అని ఎక్కిళ్ళు పట్టి ఏడ్సె.

# భావి శత్రువు

మా తలల్నే పగులగొట్టి
రాముడి ముందు పెడతారు
పాతనమ్మకపు పావుకోళ్ళకి
పాదుకా పట్టాభిషేకం చేస్తారు.
పురోహితులు
తద్దినాల మీదుగా భవిష్యత్తును గతంలోకి పునరుద్ధరిస్తారు.
హృదయ మందిరాల్లోనున్న దేవుళ్ళని పెకలించి
విసర్జించిన మధ్యయుగపు దుస్తుల్లోకి
నిండా గడ్డిమేపి నిలబెడతారు—
కుత్తుకల పంటగుత్తుల్ని కోసుకునేందుకి దేశంలో.
గతాన్ని దిద్ది పునరుద్ధరించే కృషిలో
మసీదులు మందిరాలుగా
మనుషులు వానరులుగా పునః ప్రతిష్ఠ సాగుతుంది.
కసాయి పతాక దారులు
సహజీవనశాంతికి 'స్వస్తి'క్ చెపుతారు.
నుదుళ్ళలో, మెదళ్ళలో. పిడికిళ్ళలో పొంచిన త్రిశూలాలు
జాతి కన్నుల్లో కసుక్కున పూస్తాయి.
అనాథల కళ్ళలోంచి మొదలయిన "రుధిర" నదీజలాలు
కాకిరెట్టలై 'హిందూ' మహాసముద్రంలో కల్సిపోతాయి.
జంటపక్షుల్ని విడదీసిన ఛాందస నమ్మకాలు
పశ్చాత్తాప పడనే పడవు.
రామకథ మాత్రం మొదలు పెడతాయి.
తల్లుల నుదుళ్ళమీది ఎరుపు జారిపోయి
రోడ్లమీద రక్తమై ప్రవహిస్తుంది.
శవాసనమేసిన 'సింహా'సనం సాక్షిగా
సామరస్యం శవవాసన కొడుతుంది.
మనం చేతులు కట్టుకున్నపుడు అవి మనల్ని కట్టేసిన తాళ్ళవుతాయి.
ఎలక్షణంగా తలలు పణం ఒడ్డుతాయి.
మూసుకున్న కళ్ళ ముసుగుల మాటునుంచి-
కోతులు శాఖాచంక్రమణం చేస్తాయి

(తరువాయి 33 వ పేజీలో)

# హెచ్చార్కె కవిత్వం "అబద్ధం"




—ఛాయరాజ్

"నేను చెప్పేది అబద్ధం అనుకో" అని ఎవరైనా అంటే, అతడు చెప్పింది "గట్టి నిజం" అని అర్థం. తెలుగు సంభాషణలో అబద్ధం అంటే నిజం అని అర్థం వుంది. అబద్ధమో నిజమోగాని అంకితం పేజీ చదివాక హెచ్చార్కె "మో" ప్రభావంలో పడాల్సిన గతి ఎందుకొచ్చిందా అనిపించింది. ఉద్యమ సమ్మంధాలు కోల్పోయిన ఉద్యమాసక్త కవుల పరిస్థితి ఎలాంటిదో "అబద్ధం" చెపుతుంది—

"అటు చూస్తే వాడు ఇటు చూస్తే వీడు
ఎటు దిక్కు చూసినా ఏదో ఒక పీడ
గొంతెత్తి పాడబోతే ఆ పాట
నాదే నంటుంది కొమ్మల్లో కోయిల"

కవులు ఉద్యమ కార్యకర్తలవుతున్న సమయంలో ఉద్యమాభిమాన కవులే దిక్కులు చూడాల్సివస్తుంటే హెచ్చార్కె లాంటి కవులు ఆదమరచి కనులు అర మూస్తే నెత్తిమీద పుస్తకాల అల్మెరా కూలకేం జేస్తుంది. నేటి హెచ్చార్కె మట్టి బరువు కింద విత్తనం మూలుగును మాత్రమే వినగలుగుతారు. విత్తనాల విస్ఫోటనం చూడలేరు. ఎందుకంటే—

కవికి తాను "పుట్టక ముందే పోగొట్టుకున్న ఒక ఒయాసిస్సు" కమ్యూనిజం. అందుకే అర్థాంతరంగా నిష్క్రమించి డెబ్బై ఏళ్ళ కమ్యూనిజం చరిత్రను దెప్పి పొడిచి పంజరం వీడని పక్షిని చేశారు శ్రామిక వర్గ సిద్ధాంతాన్ని.

"మలుపు తిరిగాక సంగతేమిటని
వాదిస్తూ నిలవకండి, అసలక్కడ ఆగకండి
ఇది వంతెన
ఎక్స్పైరీ డేట్ ముగిసిన వంతెన
వంతెన మీద సైనికులెవరూ
కుడి ఎడమల కవాతు తొక్కరు
పడుతూ లేస్తూనే పదండి ముందుకు"

అంటూ సిద్ధాంతాని కతీతమైన ఉద్యమాన్ని ఊహిస్తున్నాడు కవి. సిద్ధాంత రహిత

విప్లవాకాంక్ష ప్రకటించడంలో పాత కమ్యూనిస్టులూ పత్రికాధిపతులు సిద్ధహస్తులు.

కమ్యూనిస్టు విప్లవకారుల్లో ఓ గ్రూపువారు ఇంకో గ్రూపు మనుషుల్ని చంపుకోవడాన్ని "వ్రణక్షేత్రం"లో నిరసిస్తూ "బాబన్నా! బాబన్నా!! నన్ను క్షమించు/ నీతోపాటు వాళ్ళనూ ఎంతో కొంత ప్రేమించినందుకు/ అంటారేగాని ఈ సంఘర్షణలను నివారించే ప్రయత్నాలకు సహకరించేందుకు హెచ్చార్కె కున్న అవకాశాలను ఎన్నడూ వినియోగించరు. అందరూ తనకు సహానులేనన్న మేధోపరమైన ఆలోచనలతో సరైన విప్లవ కార్యాచరణను ఎంపిక చేసుకోలేక విప్లవకరంగా విలపించి, విప్లవ సిద్ధాంతాన్నే పరోక్షంగా నిరసిస్తున్నారు.

సరైన చోటే మొదలుపెట్టి, సక్రమ మార్గాన్ని ఎన్నుకోలేక, మధ్యలోనే విరమించుకొని, మరేం భయం లేని చోటనుండి ఎలుగెత్తి—

"ఎక్కడో మొదలు పెట్టాలి

....సందేహం" అంటారు హెచ్చార్కె. అదేం విడ్డూరమో! కాదంటే చూడండి కవి ఏమంటున్నారో—

"జైళ్ళ పగల గొట్టాలి
బయళ్ళంటే భయం

ఇంతకంటే గొంగళి పురుగు నయం
రంగు రంగుల స్వేచ్ఛాగతమై ఎగరడం కోసం
తన దుప్పటి తానే తగలేసుకుంటుంది"

అంటూ కొత్తబాటలు తొక్కి విరమించుకొని "రోడ్లు ఎక్కడికీ పోవు" ఏం ఫరవా లేదు "బొక్కబోర్లా పడితే ఏం?" అంటారు ఎవరి నుద్దేశించో! కవి ఆలోచనల్లో ఎన్నెన్ని వైరుధ్యాలున్నాయో చూడండి. ఉద్యమ సంబంధాలనుండి దూరమై ఎంతో కాలం గడిచాక మవునంవీడి మళ్ళీ ఏదో పలుకుదామంటే ఏమీ అర్థం కాకుండాపోయి "బయట అంతా అల్లరి అల్లరి"గా అనిపించి తననెవరో పిలుస్తున్నారని భ్రమించి "నన్నెందుకు పిలుస్తారు ఎవరైనా?" అని చిన్నబుచ్చుకొని మౌన హీన హృదయంతో "భలే బాగుంది నన్ను నేనే ఎందుకు పిలుస్తాను?" అని అంతర్ముఖుడై పోతాడు కవి. ఒక్కొక్కప్పుడు మౌనమూ మంచి పోరాట కవిత్వమే అని సంతృప్తి పడతాడు.

"నాకూ ఒక అస్తిత్వముంది

నాకూ ఒక వీరగాథ ఉంది" అని తన అస్తిత్వాన్ని ప్రకటించుకుంటూనే చేతికి దొరికిన మందారాలను ఇంకెవరి జేబులోనో కుక్కి పారిపో"యే" పరాయి కరణ ఎందుకు?

ఉద్యమంలోని ఆటుపోటులను, పైఫల్యాలను చూసి నిర్వేదన చెందిన కవి — ఒక సరైన పంథా. కార్యక్రమాలను రూపొందించుకోవడానికి విప్లవోద్యమంలో జరుగుతున్న ప్రయత్నాలనీ వాటి పోజిటివ్ ఫలితాలనీ చూడలేకపోవడం వల్ల ఆశోపహతుడవుతున్నాడు. అంతలోనే హెచ్చార్కె తేరుకొని "వ్యూహం" ఎత్తుగడలను గుర్తుకు తెచ్చుకొని, విప్లవకారులకూ అభిమానులకూ ఎలా బోధించ నెట్టుకున్నారో చూడండి—

"ఓడిపోవచ్చు
పువ్వులు వాడిపోవచ్చు
ఎన్నటికీ ఎండిపోగూడదు
ఆకులు రాల్చేసుకున్నా
బాకులు దాచేసుకోవాలి
మళ్ళీ మళ్ళీ
వస్తుంది వసంతం

"ఒక్కో గాయాన్ని వీరోచితంగా విశ్లేషించగల శస్త్రాన్ని కనిపెట్టగలగా"లంటారు. "వీరోచితంగా"విశ్లేషించగల శస్త్ర చికిత్సవల్ల వచ్చే ఫలితాలను చూస్తూనే మళ్ళీ అదే సలహాను పారేయడంలోని తొందరపాటుతనం గురించి ఏమనుకోవాలి? "మాట కాలికి కత్తిని సరిగ్గా కట్టామో లేదో చూసుకోవాలి గదా?"

అనార్కిని వ్యంగ్యంగానైనా ఆహ్వానించడం, ఎలైనేషన్‌లో పల్టీలు కొట్టి తనను తాను మత్తుగా చూసుకోవడం, రాళ్ళ వానలో నేను బతికే ఉన్నానని అస్తిత్వాన్ని చాటుకుంటూ "బాస్టర్డ్స్ ఐయామ్ స్టిల్ అలైవ్" అని కేక వేయడం ఉద్యమంలో తన చారిత్రక పాత్రను విమర్శించుకోకుండా కమ్యూనిజాన్ని పంజరంలో పెట్టి తాళం వేయడమే కాకుండా రణక్షేత్ర శిబిరంలో ప్రణయ కేళికి వ్రణక్షేత్ర మధ్యంలో వాహ్యాళికి సిద్ధపడడం - ఇవన్నీ హెచ్చార్కె ఆలోచనాక్రమానికి అడ్డం పడతాయి.

పద్యం అర్థంలా ఉండదు, అబద్ధంలా వుంటుందని సూత్రీకరించిన కవికి కవిత్వం (పాట) పరారీలో/ పరాయీకరణకు లోనై చివరకు శతృవును ప్రేమింప జేసే విశ్వప్రేమికుణ్ణి జేస్తుంది.

నేటి కవిత్వం చదివేవారిని ఉద్యమోన్ముఖుల్ని చేయాలి. ఉద్యమ కార్యకర్త లకు "తిలకాలు దిద్ద" నవసరం లేకుగాని కసిన స్ఫూర్తినివ్వాలి.

కవిత చెప్పడంలో ప్రతిభావంతుడు హెచ్చార్కె. "అబద్ధం"లో వస్తు వెలాంటిదైనా దాన్ని చాలా శక్తివంతంగా చెప్పారు.

మేధోపరమైన శక్తి సామర్థ్యాలు శ్రామిక శక్తుల అభ్యున్నతికి విజయానికి తోడ్పడాలి. సంక్షోభభరితమైన సమాజంలో కవి వంటరివాడైతే "అసహనం, అశాంతి, నిరాశ ముప్పిరిగొని భయం భయంగా ఆత్మ న్యూనతలో దాక్కుంటాడు." ఫలితంగా ఏర్పడిన అభిప్రాయాలు వ్యక్తిగతమైపోయి తాను నమ్మని సిద్ధాం తాల్లో తన అస్తిత్వాన్ని వెతుక్కుంటాడు. హెచ్చార్కెని ఎరిగిన వాళ్ళకు అతని "అబద్ధం" అర్థం చేసుకోవడం సులువు.

'అబద్ధం' హెచ్చార్కె కవిత: (1980-92) ప్రచురణ: స్వంత ప్రచురణ, 50 పేజీలు, వెల: రు. 13-00 ప్రతులకు. నవోదయ బుక్ హౌస్, హైదరాబాదు

---

(28 వ పేజీ తరువాయి)

మతరథాలు
'మధురంతాల మీంచి మరిన్ని ప్రాణాల్ని పట్టుకుని
'కాశీ'కి తీసుకుపోతాయి.
మన చెల్లెళ్ళ అక్కల సమానత్వ స్వప్నం రూపొకన్వరౌతుంది.
బిగిస్తున్న పిడికిళ్ళ 'బొటనవేళ్ళ'ని తెగ్గోస్తుంది.
తాటాకు ధర్మాల చప్పుళ్ళకు న్యాయస్థానాలు బెదురుతాయి.

o o o o

మా తలల్నే కొబ్బరికాయల్లా పగలగొట్టి
రాముడి ముందు పెడతారు.
దేవుడి పేరుతో ఈ కట్టేవన్నీ మా శ్మశానాలే!

—పి. శివి

# నెత్తుటి నేల సాక్షిగా

బలహీన జాతుల సంస్కృతి
చరిత్రలో ఎప్పుడు ఓడిపోతూనే వస్తోంది.
దీనుల రక్తంతో మట్టి తడుస్తూనే ఉంది.

జీవితాలకి జీవితాలు
గ్రామాలయితేనేం - నగరాలయితేనేం.
అన్నీ వికలం అవుతూనే ఉన్నాయి.
ఎప్పటి కప్పుడు
వందలదేహాల్ని తునాతునకలు చేస్తున్నా

ఎంత ప్రచారం ఈ మతానికి ? ? ?
విష కమలాల నీడలో—
అజ్మీరు బాలికలపై లైంగిక కుంభకోణం.
సతి ఛాయిలు—

అయోధ్య రాముల వారి సాక్షిగా
బట్టలూడదీయబడిన మహిళావిలేకర్లు
త్రిశూలం తోడుగా-
భూస్వామ్యం నీడగా-
తోడేళ్ళ జాతి జులగల సాక్షిగా--

ఒక కవి తన కథలో
యదాలాపంగా వాడిన ఒక పేరు
వీరి కదుల్తున్న పునాదులకీ
పెకిలించబడ్తున్న వేర్లకీ ఊతకర్ర అయింది.
జీవన శకలాల మీద మత కలశం నిలబెట్టబడుతోంది.

ఈవేళ అయోధ్య—
ఈ తీగె చాలా పొడవనీ వాళ్లే అంటున్నారు.
అర్థం-
త్రిశూలంకి నెత్తుటి స్నానం చాలలేదు.
రాంబందులకి శవాల సప్లైయ్ ఇంకా కొరతగానే ఉంది.
పితృస్వామ్యం - భూస్వామ్యం
చింత చచ్చినా పులుపు చావట్లేదు

అడగర్భస్థ పిండాల్ని స్వేచ్ఛగా
చంపగలరు.
రోజు రోజుకీ దారిద్రరేఖని మరింత
వెడల్పు చేస్తారు.
ఎలుగెత్తి అరిచిన ఊళ్ళని
నేలమట్టం చేయడంలో తమవంతు
కరసేవ చేస్తారు.
వీళ్ళ— మంట తమవరకూ వచ్చినా అరవకుండా
లక్షల గొంతుల్ని రిమోట్ కంట్రోల్ చేస్తారు.
మానభంగాలకీ — హత్యలకీ-
ఆకలిచావులకీ — గృహదహనాలకి -
వేటికీ మ్రోగని వీళ్ళ ధర్మగంటలు
అయోధ్యలో గుడికోసం మ్రోగుతున్నాయి
కర్ణకఠోరంగా ........
వీళ్ళ కోరిన రామరాజ్యమే వస్తే
అర్ధరాత్రివరకూ అవసరం లేదు.
సూర్యరశ్మిని చూసే అవకాశం ఉండదా రోజు స్త్రీకి.
సీతలైనా' షాబానులైనా- అమీనులైనా
అంతా మనమే-

o o o

మెజారిటీ పదానికి హిట్లర్ ఆవహిస్తే-
పేటలకి పేటలు బూడిద కుప్పలే
ఊళ్ళకి ఊళ్లే నెత్తుటి ప్రవాహాలు.
మతమే రాజకీయం- (రాజకీయమే మతం) / అవుతూ
మెజారిటీ అన్నది బాంబు అయితే-
మైనారిటీ మసీదవుతోంది ఇక్కడ.
ద్రావిడుల్ని రాక్షసులుగా మలచిన ఆర్యులు
బౌద్ధ ఆరామాల్ని విష్ణువుకి అర్పించిన ద్రోహకర్లు
ఇవాళ ప్రతి మసీదులో ఒక శివలింగాన్ని-
కాకుంటే ఇంకో కూపస్థ మండూకాన్ని చూపిస్తున్నారు.
(తరువాయి 39 వ పేజీలో)

## కులమంతా లుండాల !

బావా !

మన రాష్ట్రంలో విప్లవం వస్తాదని నువ్వేవి బియపడమాక— ఎందుకంటె మన రాష్ట్రం అట్టాటిది. పేదోళ్ళంతా ఏకమయి పోతారనేది కల్లోనిమాట— కాని కల నిజమైతే మాత్రం నానేటి సెయ్యలేను. నాను సానామంది పేద నాయకుల్ని సూసాను, పెద్ద నాయకుల్ని సూసాను. యీళ్ళు పైకెన్ని కబుర్లు సెప్పినా 'కులం' అనగానే కొత్త కులుకేక్కువవుద్ది ఎవడి కులం ఆడు సూసుకుంటూ కుల సంగాలెట్టు కుంటూ కులుకుతుంటారు S.Cలు, S Tలు, B Cలు అనే కాకుండా B.Cల్లో మల్లా ABCD లుంటాయి. యీ ఇబజన అంతా నిజం అనుకుంటారు పేదోళ్ళు. యీళ్ళు అనుకున్నది 'నిజమే' నంటారు ఆళ్ళ నాయకులు. అంతేకాకుండా కులాల అబిరుద్ధి కోసం పోట్లాడాలంటారు. ఇంకా గౌడ సేవా సంఘాలు నడుపుతారు. బలిజె అబిరుద్ధి సంగాలు పెడతారు· మహానాడులు, కాపునాడులతో హోరెత్తిస్తారు. అసలు గతం లోనే జనం యింకా ముక్క సెక్కలయిపోయి బతుకుతున్నారు. కాపుల్లో మల్లా పెద్దకాపులుంటారు, కొండ కాపులుంటారు, తూరుపు కాపులుంటారు. అలాగే పెద్ద రెడ్లుంటారు, చినరెడ్లుంటాడు. పెదకమ్మోరుంటారు, చినకమ్మోరుంటారు....ఈల్లం దర్లోనూ పేదోళ్ళుంటారు. ఆళ్ళందరూ కూలీనాలి చేసుకొని బతుకుతూనే ఉంటారు. కాని యీ నిజాన్ని అంగీకరించరు. తమలో తాము 'మేము పెద్దోళ్ళ మంటే మేము పెదోళ్ళ'మని కొల్చుకు సస్తా ఉంటారు. ఈళ్ళల్లో ఉన్న యీ పగల్ని, పట్టుదలల్ని సొమ్ము చేసుకొని కొందరు పైకొచ్చి నాయకు లయిపోతా ఉంటారు. అన్ని కులా ల్లోనూ ఉన్న పేదోళ్ళని కలవనివ్వకుండా సెయ్యటానికే యీ కుల రాజకీయాలు తరతరాలుగా నడుస్తూనే ఉన్నాయి.

మరి గందుసేత నువ్వేటి బియపడమాక. యిప్పట్లో యిప్లవం రానుగాకరాదని నేను డంకా మీద దెబ్బేసి సెపుతాను. ప్రస్తుతం డంకాలు నేవుకాబట్టి బల్లగుద్ది సెపు తాను. నీకేటి బియంనేదు.

ఈ కుల సంగాల నాయకులు ఆకులపోళ్ళ దగ్గర నుంచి 'కుల అబిరుద్ది కోసం సందాలు వసూలు సేస్తారు. ఈళ్ళ సమస్యలు తీర్చటానికి కాయితాలు తయారు సేస్తారు. ఆ కాయితాలట్టుకుని ఎకాఎకిని 'రాజదాని' కొచ్చేస్తారు. నాలుగురోజు లిక్కడే ఉండి— ఎక్కడుంటారో నీకు నేను ఏరే సెప్పనక్కరలేదు — మళ్ళీ యిళ్ళకు సేరతారు. "పని అయిపోతంది. మన మంతా బాగుపడిపోతా"మని కుల పోళ్ళకి సెపుతూఉంటారు. ఈలోగా ఆళ్ళసమస్యలు తీరటానికిఏళ్ళూ ఏళ్లూ పడతాయి. యింతలోనే యీళ్ళలోని కుల నాయకులు ఒకళిద్దరు పెజా నాయకులు, సరగశాకి నాయకులు కూడా అయిపోతారు. అయినా ఆ కులపోళ్ళందరికి యీళ్ళే ఆశాజ్యోతులు.

సంకలు గుద్దేసుకుంటారు ఆ పేదోళ్ళంతా. ఈ నాయకులు ఆళ్ళ కళ్ళకి దేవుళ్ళలా కనిపిత్తారు— నిజమే మరి—యీ దిక్కుమాలిన జనానికి అంతకంటె దిక్కెవరు? ఆళ్ళు కాయితాలు తీసుకుని రాజదాని దాకానన్నా వత్తన్నారు. ఈళ్ళకు రాజదానికి రైలెక్కటం కూడా రాదుకదా !

మరి గందు సేత బావా! ఎన్నేళ్ళయినా, ఎన్ని తరాలయినా నీజాతి జనం రాజ్జాలేలటానికి యీ కులసంగలేసాలు. యిలాంటి నాయకులున్నంత కాలం యీ పేదోళ్ళు కళ్ళు తెరవలేరు. యీళ్ళు కళ్ళు తెరిసి అందరూ కలిసి కూడు కోసం, గూడు కోసం ఒకే 'వరగం'గా తిరగబడ్డం యిప్పట్లో జరిగేది కాదు. నానే ఈర బ్రమ్మాన్ని కాకపోవచ్చు. కాని నాను సెప్పేది సత్తెం.

అందుసేత నువ్వోటి గురుతుంచుకో— ఎవరు కుల సంగాలెట్టుకున్నా నువ్వాళ్ళని ఆస్సీరదించాల. వదో వరకో పారేసి బాగా బెట్టుకోండనాల. కుల సంగాలు కూడా ఓ రకమయిన స్దానిక సంతలని, స్థానిక సంత్తల అబిరుద్దే దేశ అబిరుద్దని సూటిగా సెప్పాల. 'నా కులపోళ్ళు నాకు సాయం సెయ్యబట్టే నానింత అబిరుద్దికి ఒచ్చిసా'నని ఆళ్ళ గుండెల్లో గుచ్చుకు పోయేటట్టు సెప్పేయ్యాల. ఇలాంటి మాటలు జనం ఎన్నాళ్ళయినా, ఎన్నేళ్ళయినా యింటారు. నువ్వు ఎన్నడయినా సెప్పకాని పేదోళ్ళందరి బాదలు ఒకటేనని, ఆళ్ళ బతుకు సంగీతం ఒకే బాణీలో ఉంటాదని ఆళ్ళకు తెలయనియ్యకూడదు ఒక కులంలో ఉన్న పేదోళ్ళకి మరో కులంలో ఉన్న పేదోళ్ళు పరమ సెత్రువులుగా కనిపించాల. ఎప్పుడూ ఆళ్ళ మద్దె మంట ఎగదోత్తూ ఉండాల. యీ యివరాలన్నీ తెలిసిన ఆళ్ళ నాయకుల్ని మాత్రం సీ గుప్పిట్లో ఉంచు కోవాల. మన పెజారాజ్జెంలో యిలాంటి నాయకులంతా యినాయకులై నువ్వెట్టే నైవేద్దెం మింగుతూండాల. ఈ రకంగా కుల సంగాలనే కాదు— మత సంగాలు, బజన సంగాలు, ఆటల సంగాలు, పాటల సంగాలు, ఉద్దోగుల సంగాలు ...అందరిని యిబజించి పాలించటం నేర్చుకోవాల. అంతకాలం నీ రాజ్జానికేటి పెమాదం నేదు.

నువ్వు మాతరం పబ్లిక్‌గా పెద్ద పెద్ద సబల్లో— మనది కులమతాలు లేని పెజాస్వామ్యమని సిగ్గు, అబిమానం ఒదిలేసి ఉపన్నాసాలు ఘాటుగా యిత్తుండాల. లోపల లోపల మాత్రం ఎవడెక్కడ కుల సంగాలెట్టుకున్నా నువ్వు 'సుభం' పల కాల. రెడ్డి ఆస్టలు పెడితే, నువ్వు రిబ్బను కత్తిరించాల. 'కమ్మ' కాలేజి పెడితే బేసుగ్గా ఉందనాల. హిందూ కాలేజీలు, కిస్టియను కాలేజీలు, ముస్లిము కళాశాలలు ఇడిఇడిగా వరిదిల్లాలని అందరిని ఎంకరేజిమెంటు జేత్తు నువ్వు సుకంగ పెజారాజ్జెం సెయ్యాల.

మసీదుల్ని నిలబెట్టాల, రామమందిరాలు కట్టుకోనియ్యాల. చెర్చీలు పెట్టుకోని య్యాల యీలయినంత ఎక్కువగా జనం ముక్క సెక్కలయిపోయి కొట్టుకు సత్తూ

ండాల. యీ సమస్యలెన్నె నేకపోతే యిక మనం పరిపాలిచ్చేదేది? అసలేటుంటాది మనం పరిపాలిచ్చటానికి?? యిలా ఎవరి సంగాలాళ్ళెట్టుకొని ఒకే రాష్ట్రంలో నానా జాతులు 'పెశాంతి'గా బతకటాన్ని 'బిన్నత్తంలో ఏకత్తం' అంటారని నువ్వు చిన్నప్పుడన్న పెద్ద పెద్ద మాటలకి అర్ధం తెలవకపోయినా 'దరాబ' కొట్టేత్తుండాల. ఈళ్ళందరిని ఉప్పేత్తుండాల.

ఓ పక్క గ్రామాలకు గామాలే కొట్టుకు సత్తున్నా, బాంబులేసుకుని సొసేనాలయి పోతన్నా నువ్వేమీ బాదపడమాక. "మనుసులంతా ఒక్కటే! మీ బాదలు తీర్చటానికే నేనున్నా"నని— ఆళ్ళు నరుక్కు సచ్చిన సోటికి అవసరమయితే యిమానం మీదయినా ఎల్లి— ఉపన్నాసాలు దంచుతూ ఉండాల. ఇక ముందు యిలాంటియి జరక్కుండా సూత్తానని 'వాగదానాలు' కురిపించేయాల! అవసరమైతే నీ నెత్తురు సిందిత్తాననాల! యీలయినంత కన్నీరు కార్చేసి - ఎక్స్గ్రేసియోలు పెకటించేయాల.

ఇన్ని సేసినోడివి మరొక్కటి కూడా సెయ్యటం నేర్సుకోవాల. అదీ సానా ముక్తెమయింది. అయినా దీనికి నువ్వు పెత్యేకించి నేర్సుకొనేదేటుందిలే! మన జాతి నెత్తురులోనే ఉంది ఆ బుద్ది. అదేటంటే—

కుల సంగ లొద్దన్నవోడిని, మతం కీమత్తు మందోన్నోణ్ణి, పేదోళ్ళందరు ఏకంగావాలన్నవోడిని- కనికరం లేకుండ కాల్సి సంపేయాల. అలాంటోళ్ళని రాచ్చసులనాల, నాత్తికులనాల, పెజా ఎతిరేకులనాల సాంగిక శత్తులనాల.... ఎన్ని రకాలగా తిట్టాలో అన్ని రకాలుగా తిట్టి పెజాసోమ్యాన్ని కాపాడాల.

ఇడిఇడిగా ఎవరెన్ని సంగాలెట్టుకున్నా మనకేటి పర్వేదుగాని.... పెపంచ పేదల సంగాలు, కారిమిక, శ్రామిక సంగాలు పెట్టేవోళ్ళని ఓ కంట కనిపెడుతూ ఉండాల. అవసరమనుకున్నప్పుడు ఆళ్ళ మీదికి మన 'మురా' వోళ్ళని ఉసిగొలపాల. మురావోళ్ళు అక్కడికిపోయి అసలోళ్ళు దొరకనేదని అక్కడున్న ఆడకూతుళ్ళని 'రేపు' సేసేసినా, ఇళ్ళు లూటీలు సేసేవినా నువ్వేటి కంగారు పడమాక! మనలాటి నాయకులికి రాతిగుండెలు కావాల. ఎంత పెద్ద గొడవలయిపోనా కూడా- మనోళ్ళని 'పసిపెండు' సెస్యాలే గాని ఆళ్ళ ఉద్దోగాలూడ గొట్టమాక. మనని ఆళ్ళు రచ్చించటానికే ఉన్నారు కాబట్టి—యిలాంటప్పుడు ఆళ్ళని రచ్చించటం మన దర్మం. మన అదికారానికి ఎంతో యిస్వాసంతో కాపలాకాత్తున్న ఆపీసర్లని, మురావోళ్ళని మనకు సేతనయిన పద్దతిలోనే కాకుండా సేతకాని పద్దతుల్లో కూడా నిలువుదారుల్లో- అడ్డదారుల్లో ఎలా బడితే అలాగ ఆళ్ళని మనం రచ్చించాల. మనం మనం రచ్చించుకొన్నపుడే మన పెజాస్వామ్యం రచ్చించబడతది.

సివరకు నాను సెప్పేదేంటంటే కులమతాలతో పనినేకండా పేదోళ్ళంతా ఒకటయిపోకూడదు. ఆరకంగా ఆళ్ళందర్ని కూడేసేవోళ్ళని మాతరం బతకనీకూడదు. ఒకొక్కడే అయితే కాల్సి సంపేయాల. పార్టీలయితే బయిష్కరించాల. పేద

పెజలు యిడిపోయి బతకటానికి ఎన్ని మార్గాలయితే ఉంటాయో అని, మార్గాల్ని మనం పోత్సహించాల. అలాంటి సంగాలెట్టే వోళ్ళకి బిరుదులియ్యాల, నగదు లియ్యాల. కులమతాలు వరిదిల్లినంతకాలం మన పెజారాజ్జానికి పెమాదం నేదని నువ్వు తెలుసుకొని నిబ్బరంగ ఉండాల. పరిత్తితులు అంతగా ముదిరి పోతే నాను న్నాను, నా సారా ఉంది. మురావోళ్ళున్నారు. రౌడీలున్నారు, గూండాలున్నారు. నీకేటి బయం నేదు.

యికపోతే మా అక్క నొకసారి మా యింటికంపు. మా ముసిల్ది సూడాలం టుంది. ఏడుకొండలోడికి ఎయ్యి కొబ్బరికాయలు కొట్టాలంటుంది. ఏం కొంకలంటు కున్నాయో నాకు తెలవదు.

నానుంటాను
నీ బామ్మరిది
**కత్తుల కాంతయ్య**

---

(35 వ పేజీ తరువాయి)

ఈ దారి ఎన్నో కలలు కూలిన దారి-
ఎన్నికల దారి
హిందూత్వం-ఫాసిజం-పార్లమెంటు కేస్తున్న
కత్తుల రహదారి.
మతాలపేర్లు-అధికారుల పేర్లు-
అన్నీ ప్రవహించేది-
నీలిచుక్కల చారల జెండా కౌగిట్లోకే....
కొడి గడ్తున్న దీపాలం. / కాగడా లేద్దాం రండి.
డాలరు పిశాచిని-విష కమలాల్ని
నెత్తురు త్రాగే శిలువల్ని-నెలవంకల్ని-
అన్నింటినీ ఓడిద్దాం రండి-
మనల్ని మనం కాపాడుకుందాం.
రేపటి తరాల్ని కాపాడుదాం
జీవన దీపాలు ఉజ్వలంగా వెలగడానికి
మానవ హారాలౌదాం
మతాన్ని తుక్కు చేస్తూ మానవులుగా మిగుల్దాం —
ప్రజా సంస్కృతి పునాదుల్ని- / అబేధ్యంగా నిర్మిద్దాం-

**—పి. యస్. రమ**

# గాజు ముక్కలు

తాగుబోతులింకా చేరలేదేమో
సారా సంచీ పగలలేదు
కొరబోయిన సీసా గొంతుతో
ఆత్మ హనన దృశ్యం
ఇటు నుంచి అటు స్పష్టమే
రాజ్యమూ ఖజానా నిండుకున్న
అస్పృహ చీకటిలో
మత్తెక్కనిది పొట్లానికే
వ్యూహాలు తెలిసి
మొహం చాటేస్తాయి ముసుగులు
నటుడు మరణిస్తే
మిగిలేది జంతువే
అదివో అల్లదివో
ప్రభావ భారం నెత్తురోడడం
హింస ఉపద్రవంపై తేలడం
ఢాంఢ ఢాంఢ ఢఢాంఢ ఢాంఢం ....
బొమికలు లేని ప్రవాహం
దేహాత్మను గుటకేస్తుంది
ఛీర్ణ తాకిడిలో
పద్యాలు ఒలుకుతాయి
చీకటి పొడిచాక
అద్దాల్లో కలలు కంటాతందరూ
రెండు మెదళ్ళ చేతులు కలుపుతాయి
పట్టుదల పిడికెడే
గుండె కూడా....
ఆమె మత్తు వదిలింది
జూలు విదిలిస్తే
అంతా గతిమే
మృతులకు స్మృతు లెక్కడివి!
వెలుగు పిగిలి
విచ్చిన చీకటిలో
మానం భంగపడుతుంది
కన్నీరు
చారిక మీద బెంగ పడుతుంది
వాళ్ళు
కత్తి పదును మీద సోలిపోతారు
వాళ్ళు
సీసాలో గొంతుపొక్కుచున్న ఉన్మత్తులు
వాన వరద దౌర్జన్యం
ఎనిమిది పాదాలతో ఊడలు
జారుస్తుంది —
నెత్తురూ మిగలదు
దేహంతో నానిన ఈథర్
చావదు బతకదు
ఒక మనిషీ ఇంకో మనిషీ
ఒకరే
ఒక మనిషీ ఒక మత్తూ
కత్తిపోటు మిగిల్చిన శిథిలాలే.

—ప్రసేన్

# స్త్రీవాద సాహిత్యం - నడుస్తున్న చర్చ

—కాత్యాయని

(జూన్ 93 సంచిక "ప్రజా సాహితి"లో "స్త్రీ వాదం-సాహిత్యం" అనే అంశంపై జనసాహితి హైదరాబాదు నగరశాఖ సభ రిపోర్టు ప్రచురించాం. అదే సభలో మాట్లాడిన కాత్యాయనిగారి ప్రసంగ వ్యాసం ఈ దిగువనిస్తున్నాము. ఆ రిపోర్టులో కాత్యాయనిగారి ప్రసంగ వ్యాసం "నేటి స్త్రీవాద ధోరణులు—నవలలు-కవితలు" అని రిపోర్టు చేయబడింది. దీన్ని పై శీర్షికగా గమనించగలరు.

— సం॥)

ఇటీవలి తెలుగు సాహిత్యాన్ని ఫాలో అవుతున్న పాఠకులకు స్త్రీవాద సాహిత్యాన్ని ప్రత్యేకంగా పరిచయం చెయ్యనవసరం లేదు. అందుకే, నేనిక్కడ స్త్రీవాద సాహిత్యం గురించి జరుగుతున్న చర్చలను— ముఖ్యంగా స్త్రీవాదులకూ, మార్క్సిస్టు విమర్శకులకూ మధ్య జరుగుతున్న వివాదాలను గురించిన పరిశీలనకే పరిమితమవుతున్నాను.

ఫెమినిస్ట్ స్టడీ సర్కిల్‌వారు "మూడు తరాలు" నవలను ప్రచురించటంతో స్త్రీవాద సాహిత్యం గురించిన చర్చ ప్రారంభమైంది. ఈ నవలపై రంగనాయకమ్మగారి విమర్శా, అందుకు బదులుగా కొందరు స్త్రీవాద రచయిత్రులు చేసిన వాదనలూ, స్త్రీల సమస్యల్ని మార్క్సిస్టు, ఫెమినిస్టు దృక్పథాల్లోంచి అర్థం చేసుకోవటంలో వున్న అభిప్రాయ భేదాలను వివరించాయి. క్రమంగా, విమర్శల్లో ఈ సీరియస్‌నెస్ పోయి, వ్యక్తిగతంగా తిట్టుకోవటం ప్రారంభమైంది. ఆడవాళ్ళ మీద తిరుగులేని దెబ్బతియ్యాలంటే వాళ్ళకి అక్రమ సంబంధాల్నారోపించే భాషలో తిట్టాలనేది పురుషాధిక్య సంస్కృతిలోని ఓ లక్షణం. జ్వాలాముఖి నుంచి రావిశాస్త్రి వరకూ, మార్క్సిస్టు విమర్శకులుగా, మేధావులుగా పేరుపొందిన చాలా మందికి, స్త్రీవాద సాహిత్యం మీద తమ అభ్యంతరాల్ని తెలియజెయ్యటానికి ఆ రచయిత్రుల్ని "వార కాంతలు"గా "గయ్యాళి" వాళ్ళుగా హేయమైన తిట్లు తిట్టడం తప్ప మరో మార్గం కనిపించకపోవటం మార్క్సిస్టు విమర్శను దిగజార్చే ప్రయత్నం తప్ప మరొకటి కాదు. తమ విమర్శలు న్యాయమైనవేనని సమర్థించుకోవటానికి జ్వాలాముఖి వంటి వారు కొన్ని కారణాలు చెప్తున్నారు. ఈ రచయిత్రులు సామాజిక సమస్యల్ని వదిలేసి, వాళ్ళ వ్యక్తిగత సమస్యల్ని గురించీ, శరీరాల్ని గురించీ రాసుకుంటున్నారనీ, పిల్లల్ని కనటమనేది స్త్రీల సామాజిక బాధ్యత కాగా, వీళ్ళు దాన్ని వ్యతిరేకిస్తూ

పైగా రేబర్ రూముల హింసల్ని వర్ణించి, ఆడవాళ్ళందరినీ భయపెడుతున్నారనీ ఇలాంటివే మరికొన్ని కారణాలు చెప్తున్నారు.

దీన్నే స్త్రీ వాదులు ప్రశ్నిస్తున్నారు. స్త్రీల శరీరాల్ని, శరీరధర్మాల్నికంట్రోల్ చేస్తున్న సంస్కృతి వెనక స్పష్టమైన రాజకీయ వ్యూహం వుందనీ, ఆ నియంత్రణ నధిగమించి స్త్రీలు తమ శరీరాల్ని తమ దృష్టినుంచే చూసుకునేలా స్త్రీవాదసాహిత్యం చేస్తుందనీ వీళ్ళంటున్నారు. పిల్లల్ని కనాలా వద్దా ? కంటే ఎప్పుడు కనాలి ? ఎంత మందిని కనాలి? ఎలా పెంచాలి? అనే ఏ విషయంలోనూ స్త్రీ ప్రమేయం లేనప్పుడు, పిల్లల్ని కనటమనేది ఆమెకు సంతోషకరమైన అనుభవంగా ఎలా వుంటుందని ఈ సాహిత్యం ప్రశ్నిస్తోంది. ఈ ప్రశ్నలను అర్థం చేసుకోవటానికి, ఆ రకమైన అవగాహనతో మార్క్సిస్టు ఉద్యమాలనూ, సాహిత్యాన్నీ తిరిగి పరిశీలించుకోవటానికి, నిజానికి ఏ మార్క్సిస్టుకీ అభ్యంతరం వుండనక్కర్లేదు. ఈ విషయంలో జ్వాలాముఖి వంటి వాళ్ళు చేస్తున్న పని- స్త్రీలకుండే అదనపు సమస్యల్ని, వాటి సామాజిక స్వభావాన్నీ పట్టించుకోకుండా, యాంత్రికమైన వర్గ సర్వస్వ వాదాన్ని ముందుకు తీసుకురావటం అవుతుంది.

ఫెమినిస్టు గ్రూపుల నిర్మాణంతోనూ, ఈ సాహిత్యంలోని కొన్ని ధోరణులతోనూ విభేదిస్తున్నప్పటికీ, స్త్రీవాద సాహిత్యం ముందుకు తెస్తున్న ప్రశ్నల్ని అంగీకరిస్తూనే, ఆ రచయిత్రులపై వ్యక్తిగత దాడుల్ని వ్యతిరేకించారు చాలామంది మార్క్సిస్టు విమర్శకులు. మార్క్సిస్టు దృక్పథంతో స్త్రీవాద సాహిత్యాన్ని ఎలా చూడాలన్న సమగ్రమైన పరిశీలన జరగనప్పటికీ, ఆ మార్గంలో కొన్నిప్రతిపాదనలు మాత్రం ముందుకొచ్చాయి. స్త్రీవాద సాహిత్యాన్ని ఆహ్వానించిన మార్క్సిస్టుల విమర్శల్లో వరవరరావుగారి అభిప్రాయాల్ని ప్రత్యేకంగా గమనించాల్సి వుంటుంది. 'ఆంధ్రప్రభ'కిచ్చిన ఇంటర్వ్యూలో, స్త్రీవాదం విప్లవోద్యమంలో భాగమేనని, అది విప్లవ వారసత్వంగానే కొనసాగుతోందనీ, అందువల్ల స్త్రీవాద సాహిత్యం విప్లవ సాహిత్యోద్యమంలో భాగమేననీ ఆయన అభిప్రాయపడ్డారు. స్త్రీవాద రచయిత్రుల మీద వ్యక్తిగత దాడులకు దిగిన వాళ్ళనీ, ఈ సాహిత్యంలోని కొన్ని ధోరణులపై అభ్యంతరాలు వెలిబుచ్చి, పాజిటివ్ విమర్శ చేసిన వాళ్ళనీ— అందరినీ ఒకే గాటన కట్టి, వాళ్ళంతా "మార్క్సిస్టు వ్యతిరేకు"లని ప్రకటించారు ఆయన'ఆంధ్రజ్యోతి'లో చేరాతలకిచ్చిన సమాధానంలో. అంటే, స్త్రీవాద సాహిత్యంలోని అన్నిధోరణులనూ బేషరతుగా అంగీకరించటం మాత్రమే మార్క్సిస్టు విధానమని ఆయన అభిప్రాయం.

సరిగ్గా ఇక్కడే నాకు చాలా సందేహాలొస్తున్నాయి- ముఖ్యంగా జయప్రభ వంటి కొందరు రచయిత్రుల కవిత్వాన్ని చదువుతున్నప్పుడు. స్త్రీలు, దళితులు, పీడితుల్లోని ఏ ఇతర సెక్షన్ ఐనా కావచ్చు—వాళ్ళ హక్కులకోసం జరిగే పోరాటా

లకు శాస్త్రీయ దృక్పథాన్నిచ్చింది, వాళ్ళకు మద్దతుపలికింది మార్క్సిజమే అని చెప్పుకోవచ్చు. స్త్రీలను సమాన వ్యక్తులుగా గుర్తించి, చట్టపరమైన హక్కులను కల్పించే ప్రయత్నాన్ని ప్రపంచంలో మొట్టమొదటిసారిగా చేసింది కమ్యూనిస్టు ప్రభుత్వాలే నన్నదీ వాస్తవమే. పీడితులందరినీ మిత్ర వర్గాలుగా స్వీకరిస్తూ, వాళ్ళ పోరాటాలకు మార్క్సిజం మద్దతునిస్తుందనీ అనొచ్చు. కానీ, ఇవాళ సాగుతున్న స్త్రీవాద ఉద్యమమంతా మార్క్సిజం ప్రభావంతోనే సాగుతోందనీ, విప్లవోద్యమంలో అంతర్భాగంగా వుందనీ ప్రకటించుకోవటం ఎంతవరకూ సాధ్యమో ఆలోచించాల్సి వుంటుంది. పీడిత ప్రజల పోరాటాలను అర్థం చేసుకునేటప్పుడు ఆ తిరుగుబాట్ల వెనకవున్న భౌతిక కారణాల్నీ, వాళ్ళ మీద జరిగిన దౌర్జన్యాల్నీ అర్థంచేసుకుని, ఆ ఉద్యమాల్ని ఆహ్వానిస్తుంది మార్క్సిజం. ఐతే, ఆ ఉద్యమం సాగుతున్న క్రమంలో ఎలాంటి ధోరణులకు గురవుతోందనే విషయం మీద పరిశీలనా, చర్చా ఎప్పుడూ వుంటాయి. అందులోని నెగెటివ్ ధోరణులపై మార్క్సిస్టులకు అభ్యంతరాలూ వుండొచ్చు. ఆ ఉద్యమాల్ని మౌలికంగా బలపరుస్తూనే, ఎత్తుగడల రీత్యా విభేదించే సందర్భాలూ వుంటాయి. అంటే, విమర్శనాత్మకమైన మద్దతుని ప్రకటిస్తూ, అవి ముందుకు తెస్తున్న ప్రశ్నలించి పాఠాలు తీసుకోవటమూ, విభేదాల మీద పాజిటివ్ విమర్శని సాగించటమూ చెయ్యాల్సి వుంటుంది. ఇవాళ కొన్ని విప్లవ సంస్థలయినా అలాంటి విమర్శనాత్మక దృష్టితో వ్యవహరిస్తున్నాయని నేను నమ్ముతున్నాను. ఇదంతా స్త్రీవాద ఉద్యమానికీ, సాహిత్యానికీ కూడా వర్తిస్తుంది. అందుకే స్త్రీవాద సాహిత్యం విప్లవ సాహిత్యంలో భాగమని భావించేవాళ్ళు మార్క్సిజం మీద ఫెమినిస్టులు వెలిబుచ్చుతున్న అభ్యంతరాలకు జవాబులేమిటో వివరించాల్సి వుంటుంది. ఇప్పుడు రచనలు చేస్తున్న స్త్రీవాద రచయిత్రులపై మార్క్సిజం ప్రభావాన్ని గుర్తించటం ఎంతవరకూ సాధ్యమవుతుంది? ఆ రచయిత్రుల అవగాహనల్లో తేడాలున్నాయా? ఒక్కో రచయిత్రిలో క్రమ పరిణామాన్ని ఎలా అంచనా వెయ్యాలి? అనే అంశాలని కూడా లెక్కలోకి తీసుకోవాలి.

'స్త్రీత్వం', 'మాతృత్వం' లాంటి భావజాలాన్ని ఆదర్శీకరిస్తూ, సమాజం స్త్రీనెలాంటి దోపిడీకీ, అణచివేతకూ గురిచేస్తోందో, కొందరు స్త్రీవాద కవయిత్రులు బలంగా చెప్తున్నారు. ముఖ్యంగా ఓల్గా "రాజకీయ కథలు" ఈ అంశాలను బాగా ఎక్స్‌పోజ్ చేశాయి. కమ్యూనిస్టు ఉద్యమాలూ, సాహిత్యోద్యమాలూ నిర్లక్ష్యం చేసిన సాంస్కృతిక అంశాలనివి ఎత్తిచూపాయి. ఐతే, స్త్రీవాద సాహిత్యాన్ని క్రిటికల్‌గా పరిశీలించాల్సిన అవసరముందని నేననుకోవటానిక్కారణం-కొందరు రచయిత్రులు, ముఖ్యంగా జయప్రభ అనుసరించే విమర్శా ధోరణులు. రెండు సంస్థల మధ్యనో, రెండు దృక్పథాల మధ్యనో అభిప్రాయ భేదాలుండటమనేది చాలా సహజ

మైన విషయమే. ఐతే. అవతలి పక్షం మీద విమర్శకు దిగే ముందు వాళ్ళకూ, మనకూ మధ్యనుండే వైరుధ్యం స్వభావమేమిటన్న అంశాన్ని అర్థం చేసుకోవటం విమర్శలో వుండాల్సిన కనీసమైన బాధ్యతా, క్రమశిక్షణా అవుతుంది. ఇది జయప్రభ చెప్పకూ తెలీదనటానికి ఆమె సాహిత్యంలో కావల్సినన్ని సాక్ష్యాలు దొరుకుతాయి.

స్త్రీల సమస్యలకు సంబంధించి కమ్యూనిస్టు ఉద్యమాల ఆచరణలో వ్యక్తమైన యాంత్రిక ధోరణినీ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల మధ్య సమన్వయం లోపించటాన్నీ మార్క్సిస్టు సిద్ధాంతానికి ఆపాదిస్తూ, ఆడవాళ్ళ విముక్తికి మార్క్సిజం శత్రువనే ప్రచారానికి దిగింది జయప్రభ కవిత్వం. ఈ రకం ప్రచారం కోసం ఆమె, చరిత్రను వక్రీకరించటం దగ్గర్నుంచీ, కొన్ని సంఘటనలను జనరలైజ్ చెయ్యటం దాకా అన్ని రకాల మార్గాల్నీ ఏ సంకోచమూ లేకుండా వాడుకుంది. అలాంటి కొన్ని ఉదాహరణలు చూద్దాం—

ఉద్యమాల్లో వున్న మగవాళ్ళు భార్యల్నీ, పిల్లల్నీ గాలికొదిలేస్తారనీ, తమ కీర్తి కోసం వాళ్ళను బలిపెడతారనీ "యశోధరా ఈ వగపెందుకే" కవితలో జయప్రభ ఆరోపణ. నిజానికీ ధోరణి వసంతా కన్నాభిరాన్ "నిరీక్షణ" కవితనించే మొదలయింది. ఆ రకమైన ఆలోచనల కొనసాగింపుగానే సాగుతుంది జయప్రభ కవిత. ఇందులో బుద్ధుడు ఉద్యమాల్లో పనిచేస్తూ, ఇళ్ళకు దూరమైన మగవాళ్ళకొక ప్రతీక. ఇలాంటి కుటుంబాల్లోని స్త్రీలు ఒంటరితనానికీ, భద్రతా రాహిత్యానికీ గురవుతారనే ఆరోపణ చాలా సందర్భాల్లో వాస్తవమే కావచ్చు. సామాజిక జీవితం కోసం కుటుంబ పరిధిని దాటి బయటికి అడుగుపెట్టే ఆడవాళ్ళ మీద కూడా సాంప్రదాయవాదు లిలాంటి విమర్శలే చేస్తారు— అలాంటి స్త్రీలవల్ల భర్తా, పిల్లలూ ఇబ్బందుల పాలవుతున్నారని. ఈ రెండు సందర్భాల్లోనూ గుర్తించాల్సిన సమానలక్షణాలు కొన్ని వున్నాయి. ఇంటి పని స్త్రీల బాధ్యతనీ, కుటుంబ నిర్వహణా, రక్షణా మగవాడి బాధ్యతనీ అర్థం చేసుకోవటం— కుటుంబ వ్యవస్థను దానికదే స్వతంత్రమైందని భావిస్తూ, భార్యాభర్తలిద్దరూ ఇంటిపట్టు నుండటమే కుటుంబాల్లోని అశాంతిని పరిష్కరించుకునే మార్గమనుకోవడం ఈ రెండు రకాల విమర్శల్లోనూ సమానంగా కన్పించే లక్షణం. ఈ ఆరోపణలు చేస్తున్న వాళ్ళు స్త్రీ, పురుషుల చైతన్య స్థాయిల్లో సహజంగానే అంతరాలుంటాయనే పురుషాధిక్య భావజాలపు ప్రభావంలో వున్న వాళ్ళే. మహెజబీన్, డి. పద్మావతిల కవితల్లో కూడా ఈ లక్షణం కన్పిస్తుంది. వీళ్ళ రచనల్లో విప్లవ కారుడు ఎప్పుడూ మగవాడే స్త్రీ అతని కోసం వేదన పడుతూ, నిరీక్షించే బేలగా, ముగ్ధగా మాత్రమే వుంటుంది. పురుషుడి నుంచి రక్షణ కోసం తపించే స్త్రీలను చిత్రించే ఈ కవిత్వం స్త్రీ వ్యక్తిత్వాన్ని ఏ రకంగానూ బలపరచలేదు. కుటుంబ సంబంధాల్లోని వైరుధ్యాలకు కారణమైన

వ్యవస్థ గురించి ఈ రచయిత్రులకే అవగాహనా లేదు. కుటుంబాల్నే కాదు, మానవ సంబంధాలన్నిటినీ కలుషితం చేస్తోన్న వ్యవస్థను సరి చెయ్యటానికి పనికొచ్చే మూల సూత్రాలను అన్వేషించే లక్ష్యంతో సాగేవే ఈ ఉద్యమాలు. కుటుంబాల నుంచి బయటకు వెళ్ళే వ్యక్తులందరూ తమ భాగస్వాముల్ని హింసించే ఉద్దేశంలోనే వున్నారని ఆరోపించ దల్చుకుంటే మీరా, అక్క మహాదేవి లాంటి స్త్రీల నెలా అర్థం చేసుకోవాలి? జయప్రభ లాంటి వాళ్ళివ్వబోయే జవాబు బహుశా, 'అలాంటి స్త్రీలు కుటుంబ హింస నుంచి బయటపడటానికి ఆ మార్గాన్ని ఎన్నుకున్నా'రని కావచ్చు. స్త్రీలకు కుటుంబాల మీది భ్రమలు తొలగటానికి కారణం అక్కడ వాళ్ళే దుర్కొనే సమస్యలే కావచ్చు. కానీ ఉద్యమాల్లో పాల్గొంటున్న స్త్రీలది వ్యష్టి నుంచి సమిష్టికి విస్తరించిన చైతన్యం. కేవలం కుటుంబాల్నుంచి పారిపోవటంగా అర్థం చేసుకోవటం సరైంది కాదు. ఐతే, సమాజంలోని రకరకాల అసమానతల వల్ల వ్యక్తులందరూ ఒకే చైతన్య స్థాయిలో వుండే పరిస్థితి ఇవాళ లేదు. వ్యక్తిత్వ వికాసానికి అడ్డుగా నిలిచే అంశాలు మగవాళ్ళతో పోల్చి చూసినప్పుడు, స్త్రీలకు చాలా ఎక్కువనేది వాస్తవం. అందువల్ల ఉద్యమాల్లో పాల్గొంటున్న మగవాళ్ళ సంఖ్యలో పోల్చినప్పుడు స్త్రీలు తక్కువగానే వుంటున్నారు. ఇక్కడ స్త్రీలు పోరాడాల్సింది తమకు సామాజిక జీవితం లేకుండా చేస్తున్న పితృస్వామిక కుటుంబాలతోనూ వాటి కాధారమైన వ్యవస్థతోనూ కావాలే తప్ప, ఉద్యమాల్లో వున్న మగవాళ్ళతో కాదు. మార్క్సిస్టులైన మగవాళ్ళకు కానీ, ఆ ఉద్యమాలక్కానీ స్త్రీ విముక్తి పట్ల వ్యతిరేకతా, శత్రుత్వమూ లేవు. జయప్రభ అనుకున్నట్టుగా, ఆడవాళ్ళని ఉద్యమాల్లోకి తెచ్చి చివరికి "విశాలమైన సమిష్టి వంటిళ్ళలో వంటలక్కలుగా" మార్చే కుట్రా లేదు.

మార్క్సిజంపై శత్రుత్వ ప్రచారం కోసం జయప్రభ చేసిన మరో నీచమైన వక్రీకరణ—

"పోలీసులైతేనేం కామ్రేడ్స్ అయితేనేం
స్వర్ణైనా సరళైనా
బలాత్కరింపబడే చస్తుంది!"

అంటూ పోలీస్ ఇన్ఫార్మర్‌గా భావించి, పీపుల్స్‌వార్ సరళను హత్య చేసిన సందర్భాన్ని వర్ణిస్తుంది. సరళను చంపటంలోని దుడుకు తనాన్ని నిర్ద్వంద్వంగా ఖండించటానికి ఎవరికీ అభ్యంతరం వుండదు. ఐతే, ఇక్కడ జయప్రభ సరళ హత్యనూ, పోలీసులు రేప్ చేసి చంపిన స్వర్ణ హత్యనూ పోలిస్తూ, సరళను కూడా బలాత్కరించి చంపారని పోలీసుల్ని మించిన శత్రుత్వంతో అబద్ధపు ఆరోపణ చేస్తోంది.

ఒక సంఘటనపై వ్యతిరేకత తెలియ జెయ్యటానికి, దాన్ని జనరలైజ్ చేసి, చరిత్రను వక్రీకరించనక్కర్లేదు. స్త్రీని అవమానించటానికి మగవాడు రేప్‌ని ఆయుధంగా వాడుకున్నట్టే ఒక మగవాడిపై శత్రుత్వాన్ని ప్రకటించటానికి అత్యాచారానికి పాల్పడినట్టు అబద్ధపు ఆరోపణ చెయ్యటం కూడా పురుషాధిక్య సంస్కృతి నించి రచయిత్రి బయటపడలేదనే నిరూపిస్తుంది. వ్యక్తిగత ద్వేషాల్ని, సిద్ధాంతాల కాపాడించే పనిలో కనీసమైన విచక్షణా జ్ఞానం కూడా కోల్పోతుంటుంది జయప్రభ. తనమీద కొందరు మార్క్సిస్టు విమర్శ పేర చేసిన ఆరోపణల్ని ప్రస్తావిస్తూ—

"దొమ్మరి గుడిసెలు మరిగిన ఆచారిగాళ్ళ వాళ్ళకి
సొంత పెళ్ళామైనా తిరగబడితే
సానిగానే కన్పిస్తుంది"

అంటుంది. "దిగంబర కవుల సంస్కారం స్త్రీలని అవమానించే భాష వాడటమా?" అంటూ ప్రశ్నించిన జయప్రభ ఏ సంస్కారంతో ఇది రాసిందో ఆవిడే చెప్పాలి. తను తిట్టదల్చుకున్న వ్యక్తి పురుషుడైనప్పుడు, మధ్యలో ఒక దళిత కులానికి చెందిన స్త్రీలను అడ్డు పెట్టుకుని, వాళ్ళను "సాను"లుగా నిర్ణయించి, వాళ్ళతో అతనికి అక్రమ సంబంధాల్ని ఆరోపించే పద్ధతి ఎంత నీచమైందో, ఫ్యూడల్ తత్వానికి చెందినదో కూడా అర్థం కాని జయప్రభ ఏ అర్హతతో విమర్శలు చేస్తుందో అర్థం కాదు. "దిగంబర కవిత్వానికి స్త్రీ పాఠకులుండనక్కర్లేదా?" అని ప్రశ్నించిన ఆమె, స్త్రీవాద సాహిత్యానికి పాఠకులుగా పేదవాళ్ళు, దళితులూ అయిన స్త్రీలు పనికిరారని సిద్ధాంతీకరిస్తోందిక్కడ. నిజానికి, దీన్ని గురించి సీరియస్‌గా ఆలోచించాల్సిన బాధ్యత స్త్రీ వాదుల మీదే వుంటుంది జయప్రభ రచనల్లో కన్పించే పరస్పర వైరుధ్యాలు మార్క్సిజం గురించిన ఆవిడ అభిప్రాయాల్లోనూ కన్పిస్తాయి. ఒక వైపు కమ్యూనిస్టు ఉద్యమాల్లో స్త్రీ వ్యతిరేకమైన కుట్రల్ని చూస్తూనే, చెరబండ రాజు గురించీ, గద్దర్ గురించీ, జైల్లో వున్న "అన్నల్ని" గురించీ పొగడ్తలు కురిపిస్తుంది. మరి, కుటుంబాల్ని వదిలేసి, భార్యల్ని హింసించే మగవాళ్ళ లిస్టులోంచి వీళ్ళనెందుకు మినహాయించినట్టో? మరోచోట "మాటల్లో మార్క్సిజం— మనసులో మనుధర్మం" అంటుంది ఓ విమర్శకుడి గురించి. ఏ ఇజమైనా చివరికి మగవాళ్ళంతా ఒకటేనన్న ఆమె సిద్ధాంతం ప్రకారం మార్క్సిజానికీ, మనుధర్మానికీ తేడా ఏముంటుంది? జయప్రభ కవిత్వమంతా చదివాక, మార్క్సిజం గురించి ఆవిడ

అవగాహన ఏమిటో పాఠకుల కర్థంకాదు. బహుశా ఆవిడకూ్కడా తెలీదు!

ఐతే, జయప్రభ లాంటి రచయిత్రులు ఆరోపించనట్టు ఉద్యమాల్లోని మగ వాళ్ళలో పురుషాధిక్య ధోరణులు లేవా? అంటే లేవని హామీ యివ్వలేం. కమ్యూనిస్టు ఉద్యమం తాలూకు లక్ష్యాలను వెంటనే ప్రతి కార్యకర్తలోనూ చూడగలుగుతామని ఆశించనూలేము. ఈ ఉద్యమాల్లోని వ్యక్తులు రకరకాల పరిస్థితుల నుంచీ వచ్చిన వాళ్ళే. పితృస్వామ్య భావజాలపు ప్రభావం స్త్రీల మీదా, పురుషుల మీదా కూడా వుంటుంది. ఇక్కడి మగవాళ్ళంతా పురుషాధిక్యతను వదుల్చుకున్న వాళ్ళు కాక పోవచ్చు కానీ చాలామంది బయట పడేందుకు స్ట్రగుల్ అవుతున్న వాళ్ళే. ఈ క్రమంలో వాళ్ళు చేసే పొరపాట్ల మీద ఖచ్చితమైన విమర్శ వుండాల్సిందే. కానీ, "పోలీసులూ, కామ్రేడ్లూ" ఒకటేనంటూ స్టేట్‌నీ, దానికి వ్యతిరేకంగా సాగే ఉద్యమాల్నీ ఒకే గాటన కట్టే విచక్షణ లేని విమర్శగా మాత్రం కాదు. స్త్రీ వాదులు ముందుకు తెస్తున్న డిమాండ్లు ఏ వ్యవస్థలో ఆచరణ సాధ్యంగా వుంటాయో, అలాంటి వ్యవస్థ కోసం సాగే ఉద్యమాలు స్త్రీ విముక్తి వ్యతిరేకం ఎలా అవుతాయో విశ్లేషించుకోవాల్సుంటుంది.

కమ్యూనిస్టు ఉద్యమాలూ, సాహిత్యమూ కొంత కాలంపాటు ఆర్థిక పోరాటాలకు పరిమితమవటం కాదనలేని వాస్తవం. ఐతే, చైనా సాంస్కృతిక విప్లవమూ, తూర్పు యూరప్ పరిణామాలందించిన గుణపాఠాలూ, స్త్రీలూ, దళితులూ ముందుకు తెచ్చిన ప్రశ్నలూ— సాంస్కృతిక రంగ సమస్యల్ని సీరియస్‌గా పట్టించుకోవల్సిన అవసరాన్ని విప్లవోద్యమం ముందుకు తెచ్చాయి. ఆర్థిక సాంస్కృతిక సమస్యల్ని సమన్వయించిన సారా వ్యతిరేక ఉద్యమం దీనికో మంచి ఉదాహరణ. ఈశ్వరి, విమల వంటి కవయిత్రుల కవిత్వం 'సరిహద్దు', 'రాగో' లాంటి నవలలూ- స్త్రీ సమస్యను విశ్లేషించటానికి ప్రాధాన్యత నివ్వటం మంచి పరిణామం. స్త్రీలూ, దళితులూ, యితర పీడిత వర్గాలూ వెలిబుచ్చే అన్ని న్యాయమైన ప్రశ్నలకూ జవాబులు చెప్పాల్సిన, గుణపాఠాలు తీసుకోవల్సిన బాధ్యత విప్లవోద్యమంపై వుంటుంది. అదే సమయంలో ఉద్యమంపై జరిగే అబద్ధపు ప్రచారాల్నీ, వక్రీకరణల్నీ వ్యతిరేకిస్తూ, నిర్మాణాత్మకమైన విమర్శలు కూడా రావాల్సిన అవసరమూ వుంటుంది. ఈ అవగాహన కోసం మార్క్సిస్టు, ఫెమినిస్టు సాహిత్యాలు కృషిచేస్తాయని ఆశిస్తున్నాను. ●

# నటన జీవితం వేరు వేరు కాదు

ఇది అశోకుడేలిన నేల
ఇక్కడ తలలు తెగి నేల కొరుగుతున్నై
ఇది బుద్ధుడు వెలసిన భూమి
ఇక్కడ బోధి వృక్షాలు నేల కూలుతున్నై
ఇది గాంధీ పుట్టిన దేశం
ఇక్కడ రోజుకో గాడ్సే పుడుతున్నాడు-
ఇది మతాలు రాపిడి చేసుకునే చోటు
ఇక్కడ మందు పాతర్లు పేలుతున్నై
ఇది కులాలు కుమ్ములాడుకునే చోటు
ఇక్కడ ఎన్‌కౌంటర్లు జరుగుతున్నై
ఇది సాంప్రదాయం పూలు పూచే తోట
ఇక్కడ ప్లాస్టిక్ పూలు అమ్ముతున్నారు-
ఇక్కడ ముఖానికి రంగు వేస్తే తప్ప ముందుకు వెళ్ళలేవు
జీవితంలో నటిస్తే తప్ప
జీవితానికో అర్థం ఉండదు
భ్రమల గాజు కళ్ళతో చూస్తే తప్ప
భవిష్యత్తు ఏమిటో తెలియదు
ఊహల నిచ్చెన్లకు ఉరితాళ్ళు బిగించి
ఊగితే తప్ప జీవితం బోధ పడదు-
కాల్పనిక ప్రపంచంలో జీవిస్తే తప్ప
నీ గమ్యాన్ని చేరుకోలేవు
ఇక్కడ అడుగుతీసి అడుగు వేస్తే
సమస్యల సాలెగూళ్ళు దర్శన మిస్తై-
చిక్కు విప్పుదామనుకున్నా
వీడని బాధల శకలాలు
ఇక్కడ నటన జీవితం వేరు వేరు కాదు
నటన తెలిసిన వాడే జీవితంలో రాణిస్తాడు
నటన జీవితంలో భాగమేనని తెలిసికూడా
నటనే జీవితంగ బతుకుతాడు-

— చొక్కర తాతారావు

మతోన్మాదాన్ని పదునైన వ్యంగంతో చీల్చి చెండాడిన

# సాదత్ హసన్ మంటో

**— పరజ**

పంజాబ్‌లో సాంబ్రాలాలో 1912లో జన్మించిన సాదత్ హసన్ మంటో దాదాపు రెండు దశాబ్దాల సాహితీ జీవితాన్ని గడిపాడు. రెండు వందలకు పైగా కథలనీ, నాటికలనీ, వ్యాసాలనీ రాసేడు. పాకిస్తాన్‌లో లాహోర్‌లో 1955లో మరణించాడు.

1947 దేశ విభజనపై 32 గల్పికలూ, కథలూ 'దేశవిభజన' పేరుతో మొదట ప్రచురింపబడ్డప్పుడు సాదత్‌హసన్ మంటోను సెన్సేషనలిస్టుగానూ, సెక్సు రచయితగానూ, విషాదాన్ని బాగా సరళంగా చూపి కమర్షియల్‌గా వుపయోగించుకున్న రచయితగా విమర్శకులు- ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీకి చెందిన వాళ్ళు తీసిపారేసారు. తన పుస్తకానికి రాసుకున్న 'ముందుమాట'లో సాదత్ తాను క్రెమ్లిన్ నుండి దిగుమతైన రంగు వెలిసిన కమ్యూనిస్టు విమర్శకుల్ని, రచయితల్ని, గర్హిస్తాననీ నెత్తురుతో తడిసిన మానవత్వం జెండా తనకు శిరోధార్యమనీ ప్రకటించాడు. మతోన్మాదానికి వ్యతిరేకంగా చివరి వూపిరిదాకా పోరాడు తానని ఎలుగెత్తిచాటాడు.

'దేశ విభజన' నుండి అనువదించబడ్డ ఈ గల్పికల్లో ఆనాటి పరిస్థితులపట్ల, మత కలహాలపట్ల సాదత్ స్పందించిన తీరు అద్భుతంగా ప్రతిఫలిస్తున్నది. సాదత్ తనదైన చురుకైన వ్యంగ్య ధోరణిలో మతోన్మాదాన్ని, మత మౌఢ్యాన్నీ తీవ్రంగా ఖండించి తూర్పార పడతాడు. ప్రతి గల్పికా మానవత్వానికి అగ్రపీఠం వేస్తుంది; అల్లే ఆయన కథల్లోనూ ! అత్యంత దారుణమైన దోపిడీ పీడనలకు గురయిన స్త్రీలనూ, వ్యభిచారిణులను తన కథల్లో గుండెలు పిండేసేట్టు చిత్రించి కంట తడి పెట్టిస్తాడు సాదత్. అయితే సాదత్ ముగింపులో గొప్ప-పై చిత్రి కనబరుస్తాడు. కథలో అంతర్లీనంగా తీవ్రమైన వేదనా, క్రోధమూ, జీవన స్థితిగతులపట్ల ఆగ్రహమూ ధ్వనిస్తున్నా పైకి అవి వ్యంగ ప్రధానంగానే సాగుతాయి. చిట్ట చివరన మన మూహించని ఓ బ్రహ్మాండమైన మెలికతో, విసురుతో ముగుస్తాయి. దాదాపు అన్ని కథలూ. ఈ ముగింపు మన మొహాల్ని ఛెళ్ళున చరుస్తుంది. పురుషాధిక్యతనీ, మతోన్మాద్మాన్నీ చావుదెబ్బ కొడతాయి సాదత్ కథలు. చాలా సరళంగా సాగుతున్నట్టే సాగుతూ అత్యంత సంక్లిష్ట మానవ సమాజ సంబంధాల్ని చిత్రిస్తాయి సాదత్ కథలు. కొన్నిసార్లు కథల సారళ్యాన్నీ, వాటి చమక్కు-లాంటి ముగింపునూ చూసి ఇవేవో జిమ్మిక్కు- కథలనుకునే ప్రమాదమూ వున్నది. అయితే సాదత్ సహజసిద్ధమైన సరళమైన పదశైలి వెనక ఒక జాతి ఆవేదన, ఆగ్రహం, ఆకాంక్ష

నిబిడీకృతమై వున్నాయి. ఆ జాతి అట్టడుగు అగౌజగత్సహోదరుల బాధలు, గాథలు నెత్తురు సలసల మరిగేట్టు చిత్రిస్తాడు సాదత్.

సాదత్ వ్యంగ్యాన్నీ, వైచిత్రీగల శైలినీ రష్యన్ కథకుడు గొగోల్‌తో పోలుస్తారు విమర్శకులు. అయితే గొగోల్ జీవించిన పరిస్థితులూ, సాదత్ నేపథ్యమూ వేరు. అరిస్టోక్రసీమీద గోగొల్ అద్భుతమైన విసుర్లు విసిరాడు తన కథల్లో. రష్యన్ పెట్టుబడిదారి సమాజాన్ని, దాని తప్పిదాల్నీ వ్యంగ్యం ప్రధానంగా (irony) నిశితంగా విమర్శించాడు.

సాదత్ ఈ దేశాన్ని 1947లో అల్లకల్లోలం చేసి అతలాకుతలం చేసిన మతోన్మాదాన్ని, దేశ విభజననూ వస్తువులుగా స్వీకరించాడు. మానవతావాద దృక్పథంతో తన గల్పికల్లో; కథల్లో ఆనాటి పరిస్థితుల్నీ, బీభత్సాన్నీ అద్దంపట్టాడు. అయోధ్యా పరిణామాలానంతరం పేట్రేగిపోయిన హిందూ మతోన్మోద నేపథ్యంలో సాదత్ ఇప్పుడూ మనకెంతో దగ్గరగానే Relevant గా గోచరిస్తాడు.

**కొసమెరుపు :**

సాదత్ 'దేశ విభజన' కథా సంపుటిని, తన అనేకానేక రక్తసిక్త హత్యలని గుర్తు తెచ్చుకుంటూ 'కానీ నేనా ముసలిదాన్ని చంపినప్పుడే హఠాత్తుగా ఒక హత్య చేసాననిపించింది' అన్న కరుడు కట్టిన హంతకునికి అంకితమిచ్చాడు.

**గల్పికలు :**

## థప్పు

పొట్టను చాలా నీట్‌గా చీల్చివేస్తూ కత్తి శరీర మధ్యభాగం గుండా సరళ రేఖలో కిందికి ప్రయాణించింది. ఈ క్రమంలో ఆ మనిషి వేసుకున్న పైజామా కున్న బొందు తెగిపోయింది.

కత్తి పట్టుకున్న మనిషి ఓ మారు తేరిపార చూసి విచారంగా ఆశ్చర్యపడ్డాడు. 'అరరే థప్పు జరిగిపోయిందే !"

## కృతఘ్నత

"ఛ ! ఎంత కృతఘ్నమైందీ జాతి ! నేనంత కష్టపడి యాభై పందుల్ని మసీదు దగ్గర నరికి పారేసానా ! ఏమయింది ? ఒక్కడయినా కష్టమర్ వచ్చాడా ? పైగా దేవాలయం ముందు ఆవు మాంసం కొనేందుకు మాత్రం కుప్పలు తెప్పలుగా ఎగబడుతున్నారు !"

## అవసరమైన చర్య కోసం

ఆ రాత్రి దాడి జరిగింది. ఇరుగుపొరుగునున్న మైనారిటీ మతస్థులు చంపబడ్డాక, బతికున్నోళ్ళు బలుసాకు తినొచ్చులే అనుకుని పారిపోయారు.

ఓ మనిషీ అతని భార్యా మాత్రం వాళ్ళింటి బేస్‌మెంటులో దాక్కున్నారు.

రెండు రాత్రులు వూపిరి బిగపట్టుకుని అక్కడే కూర్చుండిపోయారు. ఎప్పుడయినా ఎవరైనా తమని కనుక్కొని నరికిపారేయవచ్చేమో నన్న భయంతో.

మరి రెండు రాత్రులు గడిచినయి. మృత్యుభయాన్ని క్రమేపి ఆకలి బాధ ఆక్రమించుకుంది. ఆకలి కోరలు గీరుకోసాగాయి.

మరి నాలుగు రాత్రులు గడిచినయి. ఇంక బతికామా చచ్చామా నిర్ణయించుకోలేని స్థాయికి చేరుకున్న దంపతులు ఆకలితో దహించుకుపోతూ బయటికొచ్చారు.

తనకే వినబడని బలహీనమైన స్వరంతో మనిషి తన యింటిని ఆక్రమించుకున్న కొత్తవాళ్ళతో "మా వల్ల కాదింక, దయచేసి మమ్మల్ని చంపేయండి" అని ప్రార్థించాడు.

"మామతం మమ్మల్ని చంపవద్దని ఆదేశిస్తుంది." అన్నారు వాళ్ళు. వాళ్ళు జైనులు. జైనమతస్థులు తమ మతాచారాన్ని బట్టి అన్ని జీవులు సమానంగా బతికి వుండాలని విశ్వసించి ఏ జీవినీ చంపరు !

వాళ్ళలో వాళ్ళు సుదీర్ఘచర్చలనంతరం కాందిశీక దంపతుల్ని జైనులుకాని తమ పొరుగువారికి అవసరమైన చర్యకోసం అప్పగించారు.

**తప్పు తొలగించబడింది**

"ఎవరు నువ్వు ?"

"నువ్వెవరివి ?"

"హర హర మహాదేవ, హర హర మహాదేవ !

హర హర మహాదేవ."

"నీవు చెబుతున్నదే నీవనడానికి సాక్ష్యమేమిటి ?"

"సాక్ష్యమా ! ? నా పేరు ధరమ్‌చంద్, అది హిందూ పేరు."

"అది పెద్ద సాక్ష్యమేం కాదు !"

"సరే ! నాకు పవిత్రమైన వేదాలన్నీ కంఠతా వచ్చు,

కావాలంటే పరీక్షించండి !"

"మాకు వేదాల గూర్చి ఏమీ తెలియదు,

మాకు సాక్ష్యం కావాలి."

"ఏమిటి ?"

"నీ ప్యాంట్ విప్పు."

అతడు ప్యాంట్ విప్పగానే పెద్ద కలకలం చెలరేగింది.

"చంపండి ! నరకండి!"

"ఆగండి, దయచేసి ఆగండి....నేను మీ సోదరుణ్ని-

భగవంతుని సాక్షిగా నేను మీ సోదరుణ్ని"

"మరింకెందుకతే ఆ సుస్తీ ఎందుకు ?"

"నేను ఏ ప్రదేశం గుండా వచ్చానో దాన్ని శత్రువులు అధీనంలో వుంచుకున్నారు. అందుకే ఈ ముందు జాగ్రత్త తీసుకోవాల్సి వచ్చింది ..... కేవలం నా ప్రాణం కాపాడుకునేందుకే....జీవితంలో నేను చేసింది ఇదొక్కటే తప్పు..... మిగతా అంతా సక్రమంగానే వున్నది."

"అయితే ఆ తప్పును తొలగించండి !"

తప్పు తొలగించబడింది...., తప్పుతో పాటు ధరమ్‌చంద్ కూడా....

## అమాయకత్వం వల్ల లాభాలు

ట్రిగర్ నొక్కబడింది. తీవ్రమైన క్రోధంతో బయటికొచ్చింది, బుల్లెట్. కిటికీ నుండి తొంగిచూస్తున్న మనిషి కిక్కురు మనకుండా దొర్లి పడ్డాడు.

ట్రిగర్ మరోసారి నొక్కబడింది. గాలిని సర్రున చీలుస్తూ దూకిన బుల్లెట్ నీళ్ళు మోసుకెళ్తున్న మనిషి లేత చర్మాన్ని ఛిద్రం చేసింది. ముఖం మీద బొక్క. బోర్లాపడిపోయిన వాడి రక్తమూ, నీళ్ళూ రోడ్డు మీద ప్రవహించాయి. మూడోసారి ట్రిగర్ నొక్కబడింది. బుల్లెట్ ఈసారి గురి తప్పి మట్టిగోడలోకి దిగబడింది.

నాల్గోదో ఓ ముసిలిదాన్ని నేల గరిపించింది.

ఆమె అరవనైనా అరవ లేదు.

ఐదోదీ ఆరోదీ వృధా అయిపోయినయి. ఎవరూ చనిపోలేదు, గాయపడలేదు.

తుపాకి వీరుడు కోపం తెచ్చుకున్నాడు. ఇంతలో రోడ్డుమీద పరుగెడుతున్న ఓ పాప కన్పడింది. వెంటనే తుపాకి ఎత్తి గురిచూసాడు.

"ఏం చేస్తున్నావ్ ?" తోడుగా వున్నా తను అడిగాడు.

"ఏం ?"

"నీ బుల్లెట్లు ఐపోయినయి."

"నోర్మూసుకో! చిన్న పాపకేం తెలుస్తుంది ?"

అనువాదం—పరశు

---

# పిల్లల ప్రపంచం





## పిల్లల భావుకత్వం

పిల్లల ఆలోచనలూ-భావనలూ చాలా చిత్రంగా ఉంటాయి. ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. వారు మాట్లాడు మాటలు ముద్దుముద్దుగా కూడా ఉంటాయి. అయితే ఒక్కో పాపా-ఒక్కో బాబు తాము చూస్తున్న ప్రపంచాన్ని తమ మాటల్లో చెప్పినప్పుడు కలిగే తన్మయత్వం వేరు. అందుకే నెలనెలా ఇలాంటి వాటిని ప్రచురించాలనుకుంటున్నాం. పెద్దలూ-పిల్లలూ కూడా సహకరించాలి.

## పిలకాయలు కాదు—

సాధారణంగా పిల్లల్ని 'పిలకాయలు' ఆకో 'పిల్లకాయలు' ఆకో పెద్దలు అంటుంటారు. ఇలా అనడం మా 'లహరి' కి నచ్చలేదు. తనది హనుమాన్ జంక్షన్.

-పిల్లల్ని అలా అనకూడదు. ముఖ్యంగా ఆడపిల్లల్ని - అసలు అందర్నీ 'పిల్ల పువ్వులు' అనండి అంది తను !

## మీకు తెలుసా !

నిజంగా నాకయితే తెలియదు. హనుమాన్ జంక్షన్‌లోనే చదువుతున్న రెండవ తరగతి పాప ఓరోజు తన నేస్తాలు నందరినీ-ఇంకా పెద్దవాళ్ళని తమ 'గేద' దగ్గరకు పిలిచి చెప్పింది.

"చూడండి గేదె నవ్వుతోంది"

గేద నవ్విందో లేదో తెలియదు. అందరూ హాయిగా నవ్వారు.

నిజమే. గేదలు నవ్వుతాయి. ఏడుస్తాయి. ప్రేమిస్తాయి. చివరి రెండూ నాకు తెలుసు. నవ్వడం మాత్రం 'సుచరిత' చెప్పాకే తెలిసింది !

## అంకుల్ మరేమో !

ఇదిగో తెనాలి నుండి అన్నపూర్ణ అడిగిన 'చిన్ని' కోర్కె.

మీ మీ ఊర్లలో పండుగలప్పుడుగానీ, ఇంకేమయినా సంబరాలప్పుడు గానీ గాల్లోకి గ్యాస్ నింపిన బెలూన్లు పంపటం తెలుసా ! అవలా గాల్లో కదులుతుంటాయి. రాత్రి పూటయితే చాలా అందంగా కనిపిస్తాయి. తనేం అడిగిందో తెలుసా !

"అంకుల్ ...అంకుల్ నేను రాత్రికి అక్కడ గాల్లో ఆ బెలూన్‌లో నిద్ర పోతానంకుల్ !"

నిజమే కదూ. ఎంత బాగుంటుందో!



నిర్వహణ : పి. చంద్రశేఖర్ ఆజాద్ APSTC Ltd., డి. సి. ఎమ్. ఎస్. బిల్డింగ్స్, ఎస్. ఆర్. పేట, ఏలూరు.

భయం అనుకోకుండా ఇంత 'చిన్ని' కోర్కెను కోరిన 'అన్నపూర్ణ' పెద్ద యితే చంద్రమండలం దగ్గరకు వెళ్తుం దేమో కదూ!

## నాసరయ్య తాతయ్య

చంద్ర మండలం అంటే గుర్తు కొచ్చింది. మన పిల్లల ప్రపంచంకోసం విజాంపట్నం నుండి నాసరయ్య తాత గారు రెండుకథలు పంపారు. అవి పెద్ద విగా ఉన్నాయి. అందుకే ఆ తాతగారు జాబిల్లి తాతమీద రాసిన కొత్తపాటను మీకోసం ఇస్తున్నా-

"చంద్రగ్రహమా-చంద్రగ్రహమా
తెల్లని వెలుగుల చల్లని గ్రహమా
ఎండలో మాడిన మనుజుల నీవు
చల్లని వెన్నెల సేదలు తీర్తువు-"

'చందమామ' పై ఇలా చిన్న చిన్న కొత్తపాటలు మీరూ రాస్తారుగా!

'బుజ్జి మిరపకాయల' మహేష్!

తను చాలా కవితలు రాసేడని ఇం తకు ముందు అనుకున్నాం కదా. తనే మంటున్నాడో చూడండి.

"రోజూ బడికి వెళ్ళాలంటే కష్టం
అందుకే వర్షం వస్తే నాకు యిష్టం"

ఇప్పుడు తను కొంచెం పెద్దవాడ య్యాడులే. వర్షం వచ్చినా బడికి వెళ్తు న్నాడు. అది సరే మీకు వానలు కురి శాయా? ఎక్కువా వచ్చు-తక్కువా వచ్చు ఎంత వాన కురిస్తే సరిపోతుందో అంతే కురవాలి. బడి మానటం కోసం కాదు సుమా-

"పాపాయి అడిగింది పచ్చిమిరప
కాయ యిస్తే వొక గాథ
యివ్వకపోతే దాంతో చాలా బాధ"

మహేష్‌కేకాదు. మీమీ చెల్లాయిల్తో-తమ్ముళ్ళతో మీకూ యిలాంటి బాధలు తప్పటంలేదా? రాసి పంపించండి.

## సుజనా...ఓ సుజనా!

తనిప్పుడు లేదు, తేలుకుట్టి చచ్చి పోయింది. ఆ పాప పూర్తిపేరు సృజనా వాహినీ నైటింగేల్. తన గురించి వాళ్ళ నాన్నగారూ, అమ్మగారూ కలిసి 'మరపు రాని పాప' అనే పుస్తకం రాశారు. 'స్వాతి' మాసపత్రికలో 1985వ సంవత్సరంలో వచ్చింది. అదిగో ఆ పుస్త కాన్ని నటరాజుండల్ లిరిగి తెస్తున్నారు. 'సుజనా' చెప్పిన మాటలూ - పాటలూ ఇంకా ఎన్నెన్నో ఇందులో ఉంటాయి. తను ఓ సారి బెండకాయపులుసు కలుపు కుని తింటూ-

"-చూడు డాడీ....బెండకాయ గుడ్లు" అంది.

అవును కదూ—కోడే కాదు-బెండ కాయలూ గుడ్లు పెడతాయి!

చివరిగా 'స్పందన' చిన్ననాటి ప్రశ్నతో ఈ నెల ఈ శీర్షిక అపుదాం-

'నాన్నగారూ కళ్ళల్లో నీళ్ళున్నాయ్'

అవును బాబూ-నదులూ-సముద్రాలూ కాలువలూ ఏవైనా ఎండిపోవచ్చు. మనిషి కళ్ళలో మాత్రం నీళ్ళుండాలి.

అవి ఆవిరయి పోకూడదు.

—మీ మామయ్య

## రాహుల్ తాతగారి పుస్తకం

మీకు తెలుసుకదా — పిల్లలందరికీ కథలు కావాలి. అందులోనూ జంతువులూ, చెట్లూ-పక్షులూ, దేవతలూ-రాక్షసులూ-రాజకుమారులూ - సాహసాలూ-ఇలా చిత్ర విచిత్రమైన కథలు వినటానికి పిల్లలు ఎంతో ఆసక్తిని చూపిస్తారు.

అయితే 'మనిషి' దే ఓ పెద్దకథని మీకందరికీ తెలుసా ?

మన తాతగారు 'మనిషికథ' ను రాశారు. పిల్లలకోసం 'బాలసాహితి' సంస్థవారు తెలుగులో ఆ పుస్తకాన్ని ప్రచురించారు. ఆ పుస్తకం కావాలని మీ యింట్లో అమ్మనూ-నాన్ననూ అడగండి. అంతగా అయితే మీరు మీకిచ్చే డబ్బుల్లో మిగుల్చుకొనయినా అలాంటి పుస్తకాలు కొని చదివి దాచుకోండి.

## మనందరికో మంచివార్త !

'పిల్లల ప్రపంచం' కు నడుమ రెండు పేజీలేకాదా వస్తున్నది. ఎందరెందరో పెద్దలు అందునా కవులూ, రచయితలూ మనల్ని గమనిస్తున్నారు. మనకీ రెండు పేజీలా ఏ మాత్రం చాలటంలేదు. అందుకే నిర్మలానంద తాతగారూ, రవి బాబు అంకులూ మరో రెండు పేజీలు ఇచ్చేస్తున్నామన్నారు. కాబట్టి ఇకనుండి మరలా నాలుగు పేజీల్లో పిల్లల ప్రపంచం !

**తెలుగుభాషలో రచనలు చేస్తున్న ప్రఖ్యాత, యువ, కవులూ, కవయిత్రులూ, రచయిత (త్రు)లూ, కళాకారులందరికి మా విన్నపం !**

**ఆహ్వానం !**

'పిల్లల ప్రపంచం' శీర్షికకు ఓ క్రొత్త కోణం ఇవ్వదలచుకున్నాం. మన కవుల్లో అందరూ 'బాల్యం' గురించి ఎప్పుడో ఒకప్పుడు కవిత్వం రాసినవారే అలాగే బాల్యం తాలూకు అనుభవాల్ని కథల్లోనూ- నవలల్లోనూ ఎందరెందరో రచయిత (త్రు)లు చిత్రించినవారే. అలాగే కళాకారులు-వారే రంగానికి చెందినవారైనా.

మొత్తంగా మనందరం ఒకనాటి పిల్లలం. అప్పట్లో మనం రచనలు చేయగలమనీ, ఇన్ని దృక్పథాలు కలిగి ఉండగలమని ఊహించి ఉండం. మనల్ని రాయటానికి ప్రేరణ ఇచ్చే అంశాల్లో 'సిద్ధాంతం' మొదటిదయి ఉండదు. "నేనెందుకు రాస్తున్నాను" అనే అంశం మీద అందరూ ఏదో ఓ సందర్భంలో చెప్పిన వాళ్ళమే. అలా చెప్పటం ఎదిగిన పాఠకులను దృష్టిలో ఉంచుకొని. అయితే ఇప్పటి స్థితివేరు.

బాల్యంలో ఉండగా మీకు ఏ వయసులో ఇలాంటి ప్రేరణలు కలిగాయి ? అందుకు కారణం ప్రకృతా ? మనుషులా ? కుటుంబమా ? ఏవి కారణాలు ? మీ తర్వాత పరిణామం అవసరంలేదు. మీలో ఆనాటి స్వేచ్ఛమైన, అనాయక

మైన అనుభూతులూ - అనుభవాలూ కావాలి.

మీకు తెలుసు. కేవలం 4 పేజీల్లో ఈ శీర్షిక నిర్వహణ జరగాలి. అందుకే ఓ పేజీలో బాల పాఠకుల్ని దృష్టిలో ఉంచుకుని రాసి పంపించండి.

అందరికీ పేరు పేరునా ఇదే ఆహ్వానం.

విభిన్న అభిప్రాయాలు గలవారుండ వచ్చు. అయినా బాల్యంలో మాత్రం ఓ గొప్ప వారసత్వానికి ప్రతినిధులే మా అనుభవాలు పిల్లల్ని ఆలోచింపచేసి, వారిలో గొప్ప ప్రేరణను అందించాలని మా ఆశ.

**ఈ అనుభవాలన్నీ పుస్తక రూపంలో !**

'పిల్లల ప్రపంచం' చేస్తున్న ఈ ప్రయోగం విజయవంతం అయితే తెలుగు ప్రజలు మరచిపోలేని కానుకగా అందిస్తాం.

అందుకే మిత్రులారా - పెద్దలారా- అమ్మలారా- ఒక్కసారి బాల్యంలోకి- పిల్లల ప్రపంచంలోకి జారిపొండి.

ఈ క్రింది చిరునామాకు పంపించండి

మరీ క్లుప్తత ఇబ్బంది అయినప్పుడు మరి కొంచెం పెద్దదయినా పర్వాలేదు. పత్రికలో ముఖ్యాంశాలు ఇచ్చినా— పుస్తక రూపంలో మాత్రం పూర్తిగా ఇవ్వటానికి ప్రయత్నం చేస్తాం. ఏమయినా క్లుప్తంగా ఉండటం అవసరం. అందరూ తప్పక సహకరించగలరనే నమ్మకంతో-

మీ చంద్రశేఖర్ అజాద్ పి.

APSTC Ltd; డి.సి.ఎం.ఎస్. బిల్డింగ్స్, నరసింహారావుపేట, ఏలూరు-534 006 ప.గో. జిల్లా

**తమ్ముళ్ళూ, చెల్లాయిలూ,**

జూన్ 15న "శ్రీశ్రీ" అనే ఒక మహాకవి చనిపోయిన రోజు. అందరూ కవిత్వాలు, పద్యాలు ఎవరెవరి గురించో రాస్తుంటే శ్రీశ్రీ గారేమో.... "పదండి ముందుకు/ పదండి త్రోసుకు/ పోదాం పోదాం పైపైకి/ మరో ప్రపంచం మరో ప్రపంచం, మరో ప్రపంచం/ పిలిచింది" అని రాసేటప్పటికి వాళ్ళంతా హడలిచచ్చారు. ప్రజలకోసం రాసేవాళ్ళకి భలే హుషారొచ్చింది.

చక్కగా ఆటలాడుకుంటూ, చదువుకుంటూ, నవ్వుతూ, కేరింతలు కొట్టే తియ్యటి బాల్యం లేని ఈ పాడు ప్రపంచం వద్దు. దీన్ని మార్చుకుందాం అని అన్నారు శ్రీశ్రీ.

అందుకే ఆయన "ఏమీ ఎరుగని పూవుల్లారా/ అయిదారేడు పాపల్లారా/ మెరుపు మెరిస్తే/ వానకురిస్తే/ ఆకసమున హరివిల్లు విరిస్తే/ అవి మీకేనని ఆనందించే/ కూనల్లారా/ మీదే మీదే సమస్త విశ్వం/ మీరే లోకపు భాగ్యవిధాతలు" అని రాశాడు. ఈ లోకం అంతా మనదేనని చెబుతున్నాడు. మరి మనదైన ఈ లోకం, ఈ దేశం ఎందుకిట్లా ఉందో మనకు నిజాలు చెప్పే అన్నదమ్ములను అడుగుదాం. —మీ ఉదయన్నయ్య

## ఉత్తరాలు

డంకెల్ ముసాయిదా గురించి సంపాదకీయం సంచలనాత్మకం. ముఖచిత్రం కూడా. రాయలసీమ వర్తమాన సామాజిక పరిస్థితులను రెండో సంపాదకీయంలో దాచేస్తే దాగని సత్యాలుగా బయల్పరిచారు. వి.ఎం.ఎస్. గారి ప్రసంగం సందర్భోచితం. స్త్రీవాదం-సాహిత్యం రిపోర్టు ఈ సంచికకు మేలుబంతి.

కాకినాడ-3 మీరా.

'కథ-90' సమీక్షలో నా కథ 'ఆటకట్టు'లో వేణుగోపాల్ (కథలో ముఖ్య పాత్ర) తమ్ముడు 'శంకరరామ' అని నవీన్ రాశారు. అది సరికాదు. వేణుగోపాల్ మిత్రుడు 'శంకర్రావు'.

'తన చిన్ననాటి మిత్రుడు శంకర్రావు తన కోసం నిన్న విమానాశ్రయానికి వచ్చాడు. ఈవేళ తన కారులో స్వగ్రామం తీసుకుపోతున్నాడు' అని కథ రెండో పేరాలో స్పష్టంగా వుంది. నాటకీయత గురించి వెతుకులాట దృష్టి మూలంగా నవీన్‌కి కథలో పాత్రలమధ్య సంబంధ అనుబంధాలు అర్థం కాలేదు.

హైదరాబాదు- శ్రీపతి.

* ('శంకరరామ' అని నవీన్ రాయలేదు. శంకరరావు అని రాశాడు. శంకరరావు అన్నా శంకర్రావు అన్నా ఏమిటి తేడా ? - సం॥)

* 1943లో 18 సంవత్సరాల వయసులో అలీపురం జైలు నుండి విడుదలై వచ్చిన సమయంలో రాహుల్జీ ఆంధ్రదేశ పర్యటనలో భాగంగా ఆనాడు 'రెడ్ విలేజ్'గా పేరొందిన దావులూరు గ్రామానికి వచ్చిన సందర్భంగా ఆ ప్రశాంత గంభీర మూర్తిని దర్శించటం, ఆయన ఉపన్యాసాన్ని వినటం జరిగింది. అంతే కాదు. ఆయనను దావులూరు నుండి తెనాలి కమ్యూనిస్టు పార్టీ కార్యాలయానికి తీసుకుపోవచ్చే బాధ్యత నాకు అప్పగించబడగా ఆయనతోపాటు తూములూరు దాకా కాలి నడకన, అక్కడి నుండి బస్సులో తెనాలి వరకు ప్రయాణం సాగించే అవకాశం నాకు లభించింది. ఆ సందర్భంగా వచ్చీరాని ఇంగ్లీషులో నేను అడిగిన ప్రశ్నలకు ఆయన నాకు అందే స్థాయి భాషలో ఎంతో అప్యాయంగా చెప్పిన జవాబులు నాకెంతో ఆనందాన్ని, ఉత్తేజాన్ని కల్గించాయి. తరువాత కాలంలో ఆయన రచనలు చదవడం ద్వారా సామాజిక అవగాహన అభివృద్ధి పరచుకొన్నాను. నన్ను అభ్యుదయవాదిగా, మార్క్సిస్టుగా, కార్యకర్తగా, రచయితగా మలచిన రాహుల్జీ శత జయంతి సంవత్సర సందర్భంగా 'ప్రజాసాహితి' ప్రత్యేక సంచికను ప్రచురించి ఆయన కృషిని ప్రజల దృష్టికి తీసుకు రావటం ఎంతైనా ప్రశంసనీయం.

ఇంకా వెలుగు చూడని రాహుల్జీ రచనలన్నీ ప్రచురించడానికి అఖిలభారత స్థాయిలో కృషి చేయాల్సిన అవసరం వుంది.

కనగాల సమతారావు.

# చైతన్య వాహిని

## రాయలసీమ భూస్వామ్య సాయుధ ముఠాల వ్యతిరేక ప్రజాస్వామ్య వేదికతో జనసాహితి :-

నేడు రాయలసీమలో భయంకరమైన గూండా రాజ్యం. పెద్దరెడ్లు, దొరల రాజ్యం మూడు బాంబులు, ఆరు తుపాకులు, పన్నెండు వేట కొడవళ్ళగా సాగుతోంది. ఒక్కొక్క రెడ్డిగారి అజమాయిషీలో ఒక్కొక్క నియోజక వర్గం అతలా కుతలమౌతోంది. కరువు సీమ అయిన రాయలసీమలో అన్నింటితోబాటు ప్రజల శాంతియుత జీవనానికి కూడా కరువు ఏర్పడింది. ఈ స్థితిని రచయితలుగా గుర్తించిన జనసాహితి సాయుధ ముఠాల వ్యతిరేక వేదిక వారి కరపత్రాన్ని జూన్ నెల ప్రజాసాహితి సంపాదకీయంగా స్వీకరించింది. ఆ వేదిక రాయలసీమలో పలు పట్టణాల్లో బహిరంగసభలు నిర్వహించి పెద్ద దొరల గుండెల్లో గుబులు పుట్టిస్తోంది. నంద్యాలలో జూన్ 12న సదస్సు నిర్వహించారు. ఆ సదస్సులో జనసాహితి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి K. రవిబాబు ఒక వక్తగా పాల్గొన్నారు. తన ఉపన్యాసంలో నంద్యాల పార్లమెంట్ ఎన్నికలు, పాణ్యం అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా జనసాహితి కార్యకర్తలు కూడా పాల్గొన్న సందర్భంగా స్వయంగా చూసిన అంశాలు గమనిస్తే "చంబల్ లోయలోని బందిపోట్ల సంస్కృతి- రాయలసీమ కొచ్చిందా" అన్నంత గగుర్పాటు కలిగిందని అన్నారు. రాయలసీమలోని యువతరంతో సహా అందరిలో పేరుకున్న పిరికితనమే దొరల దౌర్జన్యం సాగనిస్తోందని వారి పిరికితనానికి నేటి సినిమాలు బాగా దోహద పడుతోందని అన్నారు. ఒక అన్యాయాన్నో రౌడియిజాన్నో, అవనీతినో ఎదురించిన హీరో కుటుంబాన్ని పసిపిల్లలతో సహా విలన్ ఎంత అమానుషంగా చంపుతారో బీభత్సరసంతో చూపిస్తూ, ప్రేక్షకుల్లో అలా అవినీతిని ఎదురిస్తే ఏ గతి పడుతుందో అనే పిరికి మందును పోస్తున్నాయని అన్నారు. అయితే ఈ వేదిక విస్తృత కార్యక్రమం, దానికి హాజరౌతున్న ప్రజల సంఖ్య, ప్రతిస్పందన చూస్తుంటే త్వరలోనే రాయలసీమ దొరల గూండాల రౌడీల భయానక రాజ్యానికి చీటలు వారబోతోందని సూచిస్తోందని, అటువంటి పరిణామాన్ని జనసాహితి ఆహ్వానిస్తోందని అన్నారు.

## అరుణోదయ, విజయవాడ బృందం :

* జూన్ 4న విజయవాడలో మాంటిస్సోరి మహిళా కళాశాలలో ప్రగతిశీల మహిళా సంఘం (స్త్రీ విముక్తి) ఆధ్వర్యంలో జరిగిన "సారా చీప్ లిక్కర్ కాదు- తాగు సాగునీరు కావాలి' సదస్సులో అనేక పాటలు పాడారు. అక్కడి నుంచి లెనిన్ సెంటర్ వరకు జరిగిన ఊరేగింపు ముందు సామ్రాజ్యవాదానికి స్వాగతం పలుకుతూ ప్రధాని, మతోన్మాది వేషాలు పలువుర్ని ఆకట్టుకున్నాయి. బహిరంగ

సభలో "అప్పుల భారతం" వీధి భాగవత యక్షగానం ప్రదర్శించారు.

* జూన్ 19న గుంటూర్ జిల్లా పొన్నేకల్లులో జరిగిన బహిరంగ సభలో "అప్పుల భారతం"- వీధి భాగవతం, "రామజన్మ భూమి కాదురో"- వీధి నాటకం ప్రదర్శించారు. బుర్రకథ కళాకారుడు నాజర్ కూడా పాల్గొన్న ఆనాటి కార్యక్రమంలో అరుణోదయ కళాకారులు పాడిన పద్యాలు, పాటలు ప్రజల్ని ఆకర్షించాయి.

**డంకెల్ ప్రతిపాదనలకు వ్యతిరేక కార్యక్రమాల్లో "అరుణోదయ"**

* జూన్ 7,8 తేదీలలో ఆం.ప్ర. రైతుకూలీ సంఘం ఆధ్వర్యంలో సూర్యాపేటలో జరిగిన రాష్ట్ర స్థాయి సభస్సులో అరుణోదయ రాష్ట్ర స్థాయి కళాకారులు కూడా పాల్గొన్నారు. డంకెల్‌కు వ్యతిరేకంగా మిత్ర, నిరంజన్, కిరణ్, అరుణోదయ ఉపాధ్యక్షుడు రాజారావులు రాసిన పాటల్ని పాడారు. విదేశీ దోపిడిపై సామ్రాజ్య వాదుల రకరకాల ఉత్పత్తుల ఎడ్వర్‌టైజ్ మెంట్లను పేర్కొంటూ, అటువంటి ఆకర్షణలు పెట్టి ఎలా దోచుకుంటున్నారో వివరించే పాట రా॥ బాబూరావు పాడారు. డంకెల్‌కు వ్యతిరేకంగా ఎలుగెత్తిన నల్గొండ రైతాంగం 20 వేల మందితో జరిగిన మహా ప్రదర్శన అగ్రభాగాన అరుణోదయ కళాకారులు ప్రజా కళారూపాల ప్రదర్శన జరిగింది. IMF, డంకెల్ అంక్షల ఉరితాడు వేసి రూపాయిని లాకుద్మపోతూన్న సామ్రాజ్యవాది, ఆయనకు స్వాగతం చెబుతున్న ప్రధాని, మతోన్మాద వేషాలు విజయవాడ దళం, ఆ తరువాత ఒగ్గు కథ కళాకారులు "ఢల్లెం" పెద్దరాగాలు వాయిస్తూ నీలం, తెలుపురంగు దుస్తులు ధరించిన 20 మంది కళాకారులు, ఆ తరువాత ఎరుపు షర్టు, తెల్ల పంచెలు ధరించిన 50 మందితో డప్పుల నృత్యం, ఆ తరువాత 40 మందితో కోలాటం, ఆ తరువాత నీలం రంగు షర్టు, తెల్ల పంచెలు ధరించిన మరో 40 మందితో డప్పుల నృత్యం, ఆ తరువాత నల్గొండ జిల్లా అరుణోదయ కళాకారుల బృందం 20 మందితో విప్లవ గేయాలతో-నృత్యం చేస్తూ సాగారు. అనంతరం జూనియర్ కాలేజీ గ్రౌండ్స్‌లో జరిగిన బహిరంగ సభలో "అప్పుల భారతం" యక్షగానం ప్రదర్శించారు.

ఈ రాష్ట్ర సదస్సు పిలుపు మేరకు జూన్ 21 అన్ని జిల్లాల ప్రధాన కేంద్రాలలో జరిగిన ధర్నాల్లో, ఊరేగింపుల్లో, బహిరంగసభల్లో అరుణోదయ కళాకారులు పాల్గొన్నారు. గుంటూరు జిల్లాలో కలెక్టర్ కార్యాలయం ఎదుట ధర్నాలో గుంటూరు జిల్లా అరుణోదయా కళాకారులు పాటలు పాడారు. కృష్ణాజిల్లా మచిలీపట్నంలో కలెక్టర్ కార్యాలయం ఎదుట జరిగిన ధర్నాలో పాల్గొని, ఊరేగింపు ముందు డంకెల్, ఉరితాడు, రూపాయి, ప్రధాని, మతోన్మాది వేషాలు ప్రదర్శించారు. బస్ స్టాండ్ ఎదుట జరిగిన బహిరంగసభలో మచిలీపట్నం శాఖ కళాకారులు అనేక పాటలు పాడారు. "డంకెలోడురో ప్రజల డొక్కలను చీల్చుతుండు" పాటను

కా॥ చైతన్య పాడి వినిపించారు.

**సిల్క్‌స్మిత అశ్లీల స్టార్ నైట్‌ను వ్యతిరేకిస్తూ అరుణోదయ కళాకారుల అరెస్టులు - వేధింపులు :**

ఉచిత వైద్య సేవలందించడానికి నిధుల వసూలు కోసమంటూ మంగళగిరి లయిన్స్‌క్లబ్ వారి అధ్వర్యంలో గుంటూరు, తెనాలి, మంగళగిరి, చిలకలూరిపేట, విజయవాడలలో సిల్క్‌స్మిత నృత్యాలు, మాల్గాడి శుభ, రైల్గాడి రాధికల పాటలతో కార్యక్రమాలు ప్రకటించింది. అన్ని ప్రజా సంఘాలతో పాటు జనసాహితి అరుణోదయలు కూడా "అశ్లీల స్టార్ నైట్ సంస్కృతిని ప్రతిఘటించండి" అని పిలుపు నిచ్చాయి. కొన్ని చోట్ల ఈ కార్యక్రమ నిర్వాహకుల్లో పోలీస్ అధికార్లు కూడా ఉన్నారు. గుంటూరు, విజయవాడల్లో పెద్ద ఎత్తున పోలీసుల్ని మోహరించి మరీ జరిపారు. ప్రతిఘటన, వ్యతిరేకత రాబోతుందని గ్రహించిన నిర్వాహకులు గుంటూరు ప్రదర్శనలో సిల్క్‌స్మితకు నిండుగా బట్టలు తొడిగి డ్యాన్సు చేయించారు. పత్రికల వారు, పోలీసులు అశ్లీలతేం లేదు. బాగానే వుంది అని వాకృచ్చారు. దానితో రెచ్చిపోయి చిలకలూరిపేట నుంచి అర్ధనగ్నంగా దుస్తులు వేయించారు. గుంటూరులో 300 మందితో ఊరేగింపు, ధర్నా జరుగగా అరెస్టు చేశారు. జూన్ 12న విజయవాడలో కళాక్షేత్రం ఎదుట ధర్నా చేయబోయిన వారిని అరెస్టుచేసి 3వ పట్టణ స్టేషన్‌లో నిర్బంధించారు. స్వాతంత్ర్య సమరయోధుడు తుమ్మల గోపాలకృష్ణయ్య అశ్లీలతా ప్రతిఘటనా వేదిక కన్వీనర్ ఈదర గోపిచంద్‌లతో సహా POW (స్త్రీ విముక్తి) అరుణోదయ కళాకారుల్ని 28మందిని బలవంతంగా దౌర్జన్యంగా ఫొటోలు తీయించారు. బందిపోట్లలాగా, జేబుదొంగలు, హంతకులులాగా ఫొటోలు తీయడం ఏమిటని నిరాకరించి నందుకు అరుణోదయ రాష్ట్ర కార్యదర్శి ఓదయ్‌ను జుట్టుపట్టి రెక్కలు విరిచి పట్టుకుని ఫొటో తీసి, లాకప్పులో వేశారు. పోలీసుల చర్యల్ని ఖండిస్తూ పత్రికాప్రకటనలు, కలెక్టర్‌కు మెమొరాండంలు ఇచ్చారు.

**అరుణోదయ, ప్రకాశంజిల్లా శాఖ :**

* జూన్ 17న ఉప్పు గుండూరులో జరిగిన రైతుకూలి సంఘం భూ పోరాట సదస్సు యొక్క బహిరంగ సభలో పలుకూరు అరుణోదయ కళాకారులు అనేక పాటలను పాడారు. చెర్లోపాలెం బాలకళాకారులు నృత్యాలు, ఒంగోలు కళాకారులు రైతు-నృత్యం- చాతే ఉప్పు గొండూరు కళాకారులు "జలగ" నృత్య నాటిక ప్రదర్శించారు.

**PDSU- జనరల్ కౌన్సిల్‌లో అరుణోదయ కార్యక్రమాలు.**

* జూన్ 27, 28, 29 తేదీలలో కరీంనగర్‌లో రిక్కల సహదేవ్ నగర్‌లో జరిగిన PDSU రాష్ట్ర కౌన్సిల్‌లో గుంటూర్‌జిల్లా, కరీంనగర్ కళాకారులతో "రామజన్మ భూమి కాదురో" వీధి నాటకం ప్రదర్శించారు.

# సంస్పందన

శబ్దం నిశ్శబ్దంలోకి
బలవంతంగా నొక్కబడుతున్న
ఈ నిశ్శబ్ద నిశీథిలో
మౌనంగా మేల్కొని
నా హృదయ ఘోషల్ని
అక్షరాల్లోకి అనువదిస్తూ
నా ఎద కదలికల్ని
కాగితం మీద పెడుతూ
నా ఆలోచనాక్షరాల్ని
ఈటెలుగా మలుస్తూ
కుళ్ళిన ఈ సమాజపు
కూకటివేర్లని
పెకిలించే ప్రయత్నంలో
నిట్ట నిలువునా కాలిపోయాను
నిజంగా చచ్చిపోయాను
కాని -
ఓడిపోను

శోధన్